## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలుపైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలుపైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020120001291

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్థం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాధ పాద సమర్పణమస్తు *

## భారత ప్రభుత్వపు వెబ్ సైట్ - డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా

## http://www.new.dli.ernet.in

Digital Library of India: In ×

www.new.dli.ernet.in

# Digital Library of India

Hosted by: Indian Institute of Science, Bangalore in co-operation with CMU, IIIT-H, NSF, ERNET and MCIT for the Govt. of India and 21 major participating centres.

Home | Vision | Mission | Goals | Benefits | Content Selection | Current Status | People | Funding | Copyright Policy | FAQ | RFP

Books Journals Newspapers Palm-Leaves (Manuscripts)

Title: Ramayanam

Author:

Year: to

Subject: Any Subject

Language: Telugu

Scanning Centre: Any Centre

Clear | Search

Presentations and Report
Statistics Report
Status Report
Feedback | Suggestions | Problems | Missing links or Books

Click here for PDF collection
DLI MIRROR at IUCAA Data Center PUNE

DLI

For the first time in history, the Digital Library of India is digitizing all the significant works of Mankind.

Click Here to know More about DLI New!

| Books | Journals | Newspapers | Manuscripts |
|---|---|---|---|
| Rashtrapati Bhavan<br>CMU-Books<br>Sanskrit<br>TTD,Tirupathi<br>Kerala Sahitya Akademi | INSA | Times of India<br>Indian Express<br>The Hindu<br>Deccan Herald<br>Eenadu<br>Vaartha | Tamil Heritage Foundation<br>AnnaUniversity NEW! |

Title Beginning with.

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Author's Last Name

A B C D E F G H I J K L M N O P Q R S T U V W X Y Z

Year

1850-1900 | 1901-1910 | 1911-1920 | 1921-1930 | 1931-1940 | 1941-1950 | 1951-

Subject

Astrophysics | Biology | Chemistry | Education | Law | Mathematics | Mythology | Religion | For more subjects...

Language

Sanskrit | English | Bengali | Hindi | Kannada | Marathi | Tamil | Telugu | Urdu

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014

# సాహసమే జీవితం

సంకలన కర్త
శ్రీ దీనానాథ్ బత్రా

అనువాదం
శ్రీ దోనెపూడి వెంకయ్య

నవయుగ భారతి ప్రచురణలు
హైద్రాబాద్





# మనవి

ప్రపంచ కథా సాహిత్యంలో 'పంచతంత్రం', 'హితోపదేశం' విశిష్ఠమైన స్థానాన్ని సంపాదించుకున్నాయి. అలాగే 'ఈసఫ్స్ ఫేబుల్స్' గా పిలువబడే ఈసఫ్ కథ లకూ పాఠకుల నుండి మంచి ఆదరణ లభించింది. అలా ప్రాచీన కథల మాదిరి ఆధునిక కాలానుగుణమైన ఎన్నో కథలను, మహాపురుషుల జీవితాలనుండి, చరిత్ర నుండి స్వీకరించి చిన్న పిల్లలకు చెప్తే వారిపై చక్కని ప్రభావముంటుందనటంలో సందేహంలేదు.

శ్రీ దీనానాథ్ బత్రా చాలా కాలంగా విద్యారంగంలో అగణీయమైన కృషి చేస్తున్న వ్యక్తి. తమ అపార అనుభవాన్ని పురస్కరించుకుని,. మారుతున్న సామాజిక పరిస్థితులను దృష్టిలో ఉంచుకొని, బాల బాలికలకు స్ఫూర్తిని అందిస్తూ, నైతిక విలువలను బోధించే విధంగా శ్రీ దీనానాథ్ బత్రా కొన్ని చిన్న కథలను సంకలనం చేశారు. వాటిని నాలుగు సంపుటాలుగా హిందీలో ప్రచురించారు. ఆ సంపుటాలకు మాననీయ శ్రీ కె. సి. సుదర్శన్ 'ముందుమాట'ను వ్రాసి ఇచ్చారు.

తెలుగులో ఆ కథా సంపుటాలు ప్రచురిస్తే బాగుంటుందని పలువురు సూచించారు. ఆ సూచన మేరకు తెలుగులోకి అనువదించమని కోరగానే అనువదించి ఇచ్చిన శ్రీ దోనేపూడి వెంకయ్యకు, మూల గ్రంథసంకలనకర్త శ్రీ దీనానాథ్ బత్రాకు, ప్రకాశకులు సురుచి ప్రకాశన్, కొత్తఢిల్లీ వారికి మా కృతజ్ఞతా పూర్వక నమస్కారములు.

- ప్రకాశకులు

ముక్కోటి ఏకాదశి
పుష్యమాసం. యువనామ సం.
**1 జనవరి 1996**

# ముందుమాట

శిశువులకు బాలురకు మనస్సు భావప్రధానంగా ఉంటుంది. సంస్కారాలను గ్రహించేదిగా ఉంటుంది. ఇది ప్రపంచమంతటా అంగీకరింపబడిన విషయం. శిశువులకుగాని బాలురకుగాని మూడేండ్లనుండి పదునాలుగేండ్ల ప్రాయం లోపల ఏయే విషయాలు మనస్సులో చోటు చేసుకుంటాయో, అవే ఆయా వ్యక్తుల స్వభావాన్ని తీర్చిదిద్దటానికి పునాదిరాళ్ళు అవుతాయి. ఇందువల్లనే అన్ని కాలాలలో, అన్ని దేశాలలో సౌశీల్యం నిర్మాణ ప్రక్రియకు అత్యంత శ్రద్ధ వహించబడుతుంది.

స్వభావాన్ని తీర్చిదిద్దే ప్రక్రియలో కథాసాహిత్యానికి అన్నింటికంటె ఎక్కువ ప్రాముఖ్యం ఉంది. చదువను వ్రాయనురాని సంచార జాతులలో జనజాతులలో సైతం కథలు, గాథల ద్వారానే భావితరాలకు అవసరమైన విధులు, విలువలు తెలుస్తాయి. 'పంచతంత్రం' , 'హితోపదేశం' గురించి అందరికీ తెలుసు. మూర్ఖులైన రాకుమారులను నీతివంతులుగా వ్యవహార కుశలురుగా తీర్చిదిద్దేందుకు అవి రచింప బడ్డాయి. ఆనాటి నుండి ఈనాటివరకు ఈ కథలు ప్రపంచంలో సార్వకాలీనమైన సాహిత్యంలో భాగంగా ఉండి, వ్యక్తి నిర్మాణ ప్రక్రియలో ప్రధానమైన భూమిక నిర్వహిస్తూ వచ్చాయి. వీనితో బాటుగా రామాయణం, మహాభారతం, అష్టాదశ పురాణాలు, జాతక కథలు, భేతాళ పంచవింశతి, ముప్పది రెండు సాలభంజికలు, కథాసరిత్సాగరం మొదలుగాగల అపారమైన కథాసాహిత్యం మనకున్నది. ప్రపంచంలో మిగిలిన దేశాలలో కూడా 'ఈసఫ్ కథలు', 'అరేబియన్ నైట్స్' ఇత్యాది సాహిత్యం వెలువడింది. ఇవే కాకుండా చారిత్రక సంఘటనలు కూడా వేలాదిగా ఉన్నాయి. వీని ద్వారా పౌరుషం, పరాక్రమం, దయ, క్షమ, కరుణ మొదలగు ఉత్కృష్ట మానవ జీవన మూల్యాలు వెల్లడి అయినాయి. ఇంతేకాదు, జీవితంలో మనకు మార్గదర్శనం చేయుజాలిన ఘట్టాలను మనం దైనందిన జీవితంలో కూడా చుట్టుప్రక్కల ఎన్నింటినో ఈనాడూ చూస్తుంటాము. మహాపురుషులు తమ

స్వీయ దృష్టాంతం ద్వారాను, తమ ప్రబోధాలలో ఉదహరించే దృష్టాంతాల ద్వారా కూడా కథాసాహిత్యం ఎంతగానో పరిపుష్టమైంది. కావలసింది ఒకటే. విశాలమైన ఈ కథాసాగరంలో మున్కలువేసి మనకు కావలసిన రత్నాల్ని వెతకి వెలికి తీయవలసి ఉంది. ఈ పని సులభంకాదు. బాలుర హృదయాలపై చెరగని ముద్ర వేయగల వ్యక్తి మాత్రమే ఇట్టి కార్యంలో కృతకృత్యుడు కాగలడు. శ్రీదీనానాథబత్రా తన జీవితం యావత్తు బాలురను సంస్కారవంతులుగా చేయటంలోనే గడిపిన వ్యక్తి. కురుక్షేత్రంలోని గీతా విద్యాలయాన్ని ప్రాంతంలోని అత్యుత్తమ విద్యాలయంగాను దేశంలోని ఉత్తమ విద్యాలయాలలో ఒకటిగాను రూపొందించిన వ్యక్తి. ప్రస్తుతం దేశంలో నిర్వహించబడుతున్న దాదాపు ఆరువేల శిశు, బాల మందిరాలకు మార్గదర్శనం చేస్తున్న వ్యక్తి. సుదీర్ఘమైన తమ అనుభవం ఆధారంగా వారు ఈ కథా సంపుటాలను సంకలనం చేశారు. బాలురలో అవి తప్పక చక్కని సంస్కారాలను కలిగిస్తాయి.

ఈనాడు ఎటు చూసినా నైతిక విలువలు దిగజారిపోయాయి. హింసాప్రవృత్తి, లంచగొండితనం, కాముకత్వం, స్వార్థం సర్వత్ర తాండవిస్తున్నాయి. ఇట్టి పరిస్థితిలో నైతిక శిక్షణ అనివార్యమయిన విషయం. దీనిలో మరో అభిప్రాయానికి తావులేదు. గట్టి కృషి చేయటం ఒక్కటే అవసరం. భావితరం పట్ల తమకుగల బాధ్యతను గుర్తెరిగి అధ్యాపకులు తమ సదాచరణ ద్వారా చక్కని ఉదాహరణలుగా నిలిచేందుకు ముందంజవేసిన నాడు మాత్రమే ఇది సాధ్యమవుతుంది. అట్టి అధ్యాపకులకు ఈ కథల సంపుటి సహాయకారిగా ఉంటుందని నా విశ్వాసం.

భాద్రపద కృ.5,2051 వి.సం.
26 ఆగష్టు, 1994.

(కుప్.సి. సుదర్శన్)
సహ సర్ కార్యవాహ
రాష్ట్రీయ స్వయంసేవక సంఘ్

# ఉపోద్ఘాతం

అత్యంత విశాలమైన సమష్టి తత్త్వ పరిధిలో ఎన్నో అంశాలున్నాయి. వ్యక్తి, కుటుంబము, గ్రామము, సమాజము, రాష్ట్రము, విశ్వము, ఈ సృష్టిలోని సమస్త చరాచరముల నుండి పరమేశ్వరుని వరకు గల సమస్తమూ వీనిలో కలిసి ఉన్నాయి. ఇందులో వ్యక్తి లఘుతమ తత్త్వం. సప్తపదీనమైన ఈ యాత్ర మానవుణ్ణి సంపూర్ణ మానవునిగా చేస్తుంది. 'నర కరనీ కరే తో నర నారాయణ హోజాయ్' (స్వధర్మాచరణం ద్వారా నరుడు నారాయణుడౌతాడు) అనేది ఈ దేశానికి గల ధ్యేయ వాక్యం.

నరుడు నారాయణుడు కాగలడా? లేక ఇది ఒక వ్యర్థమైన ఊహామాత్రమేనా? భారతీయ ఋషులు, మనీషులు, కర్మయోగులు, మేధావులు, తత్త్వజ్ఞులు మానవ జీవితమనే ప్రయోగశాలలో ప్రయోగాలు చేసి ఈ ప్రశ్నకు సమాధానం కనుగొన్నారు. మనకు సుస్పష్టమైన సిద్ధాంతాలను అందించారు. ఈ సిద్ధాంతాలు, నియమాలు, సద్గుణాలు ఆధారంగా వ్యవహరించినట్లయితే మనం జీవితంలో సుఖపడటమే కాదు, ఈ లోకమంతటినీ కూడా సుఖమయం చేయగల్గుతామని వారు ప్రకటించారు. ఈ జీవన మూల్యాలను ఏర్పరచేందుకు వారు ఘోర తపస్సు కావించారు. జ్ఞానాన్ని సంపాదించారు, తదనుగుణంగా జీవించారు. ఈ జీవన మూల్యాలే మన దేశ సంస్కృతీ సారం. అవి మన దేశానికి ఆత్మ.

భరతవర్షం అంటే కేవలం ఒక భూఖండం కాదు. మనకు సరిహద్దులుగా ఉన్న పర్వతాలు, నదులు, సముద్రం, భూమి, అరణ్యాలు - ఇవే భారతదేశం కాదు. ఈభూమిపై నివసిస్తూ ఈ ఉత్కృష్ట సంస్కృతికి వారసులై, మానవ జీవన మూల్యాలకు సంరక్షకులై 'భారత్ నా తల్లి, నేను ఈమెకు పుత్రుడను,' - అనే వారి యొక్క సమాజమే భారత్; విశ్వకళ్యాణ కామనతో ఇతరుల

శ్రేయస్సుకై సర్వస్వార్పణ కావించే మహాత్ములే భారత్, ఆత్మతత్త్వం యొక్క నిగూఢ రహస్యాన్ని బోధించే ఋషి పుంగవులదైన ఈ దేశం భారత్. శిశువులకు ఊగే ఊయల, యువకులకు ఉద్యానవనం, వృద్ధులకు వారాణాసి, మానవత్వానికి రక్షణ కేంద్రం, పుణ్యభూమి, ధర్మ భూమి, కర్మభూమి, దుష్టుల నుండి కాపాడుకోవలసిన భూమి ఈ భారత్. కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో మాక్సుముల్లర్ ఈ భూమిని గురించే ఇలా చెప్పారు 'మానవ హృదయంలోని సర్వోత్కృష్టగుణాలు ఏ దేశంలో వికసించాయి? జీవితంలోని గడ్డు సమస్యలను గురించి ఎక్కడ లోతుగా తరచి చూశారు? ప్లేటో, కాంట్ మొదలయిన తత్త్వవేత్తలను గురించి అధ్యయనం చేసేవారు కూడా గమనించతగ్గ సమాధానాలు ఎక్కడ ఇవ్వబడ్డాయి? ఇలా ఒక వేళ నన్ను ఎవరైనా అడిగితే నేను భారత్‌వైపు వ్రేలు పెట్టి చూపిస్తాను'

వ్యక్తి యొక్క వికాసం కోసం సోపాన క్రమంగా ఇక్కడి తత్త్వజ్ఞులు పంచకోశములను కనుగొన్నారు. అవి శరీరము, ప్రాణము, మనస్సు, బుద్ధి, ఆత్మ. ఐదు అంగములనుండి మూలాధారములైన ఐదు మూల్యములు జనించాయి అవి - శక్తి, సంతులనము, సద్విచారము, సత్యాన్వేషణము, సేవ.

అహం నుండి వయం దాకా సలిపే యాత్రను సఫలీకృతమొనర్చేందుకు జీవితంలో సద్గుణ సంపదను ఆర్జించుకోవాలి. తదనుగుణంగా జీవించాలి. ఇది అత్యంతావశ్యకం. జ్ఞానము, ఇచ్ఛ, క్రియ - ఈ త్రివేణీ సంగమం ఆధారంగానే మనిషి ఉన్నతిని పొందేందుకు యోగ్యుడవుతాడు.

జీవన మూల్యాలను సమన్వయ పూర్వకంగా సేకరించి, అవి ఆధారంగా ఆయాఘట్టాలను గ్రహించి సంకలనం చేయబడ్డది. 'ప్రేరణ దీపాలు' ప్రేరణాదాయకమైన సంఘటనలతో కూడిన గ్రంథం. ప్రస్తుత కాలంలో పెద్ద పెద్ద గ్రంథాలను , పుస్తకాలను , జీవిత చరిత్రలను చదివేందుకు, వాటిని మననం

చేసుకొనేందుకు సమయం దొరకటంలేదు. ఈ గ్రంథంలోని ఘట్టాలు చూడటానికి చిన్నవే. కాని ఇవి హృదయాలపై చెరగని ముద్ర వేస్తాయి. 'పిట్ట కొంచెము కూత ఘనము' అని చెప్పవచ్చు.

ఈ గ్రంథ రచనలో ప్రత్యక్షంగాను పరోక్షంగాను అనేకుల సహాయ సహకారములు సమకూరాయి. వారందరికీ నా హృదయ పూర్వక కృతజ్ఞతలు. 'ప్రేరణ దీపాలు' సంకలనంలో అనేక ధర్మ గ్రంథాలనుండి, పుస్తకాలనుండి, ఉపన్యాసాలనుండి, బోధల నుండి, పత్రికల నుండి విషయం సేకరింపబడింది. వారి పేర్లన్నీ జాబితా వ్రాయటం మొదలుపెడితే అది చాలా పెద్దదవుతుంది, అంతులేకుండా ఇంకా సాగిపోతూనే ఉంటుంది. వారందరికీ కృతజ్ఞతలు సమర్పించుకుంటున్నాను.

పంచవటిలో ఉండగా సీత లక్ష్మణుని అడిగింది, 'శ్రీరాముని చరణాలు, నా చరణాలలో ఎవరి చరణాలు అందంగా ఉంటాయి?' లక్ష్మణుడు చెప్పాడు 'తల్లీ, మీ ఇరువురి అందం ఈ చరణాలలో లేదు, మీ ఆచరణలో ఉంది,' అని చెప్పాడు. వాస్తవానికి వ్యక్తి తన ఆచరణ కారణంగానే విద్వాంసుడౌతాడు. మహాత్ముడౌతాడు.

ప్రేరణ దీపాలు' అనే ఈ గ్రంథంలోని వ్యక్తులు జీవన పథంలో తమ అడుగుజాడలు మిగిల్చి పోయిన మహాపురుషులు. వారి అడుగుజాడలను బట్టి మనం మన మార్గాన్ని అన్వేషించుకొని ఆ మార్గంలో ముందుకు సాగ గల్గితే ఈ గ్రంథరచనకై చేసిన ప్రయత్నం సఫలీకృతమౌతుంది.

ఇతి శుభం

- దీనానాథ్ బత్రా

సంస్కృతి భవన్
గీతా విద్యా లయ పరిసర్
కురుక్షేత్ర

# పరోపకారి అయిన బాలుడు

ఒకసారి సముద్రంలో భయంకరమైన తుఫాను వచ్చింది. ఒడ్డుకు సమీపంలో ఒక ఓడ మునిగిపోతోంది. ప్రయాణీకులను రక్షించాలంటే తీరం నుండి ఏదైనా నావ వెంటనే అక్కడకు చేరాలి. నావను నడిపే వ్యక్తి కావాలి. అంతటి తుఫానులో ప్రాణాలకు ముప్పు ఎవరు తెచ్చుకుంటారు? తీరంలో ఒక బాలుడు నిల్చుని ఉన్నాడు. ఈ స్థితిని గమనించగానే అతనికి దయ కలిగింది. అతను నావను సముద్రంలోనికి తీసుకొని వెళ్లడానికి సిద్ధపడ్డాడు. అందుకు తల్లి అనుమతి కోరాడు.

పిల్లవాని మాట విన్న తల్లికి పుత్రవ్యామోహం అడ్డువచ్చింది. ఆ బాలుని తండ్రి ఆరునెలలకు పూర్వమే సముద్రయాత్రకై వెళ్లాడు. ఇంతవరకు రాలేదు. అతను చనిపోయి ఉంటాడని అంతా అనుకున్నారు. ఈ బాలుడు మినహా ఆ తల్లికి వేరే ఆధారం ఎవ్వరూ లేరు. వీనికి ఏమైనా అయితే తనకున్న ఆ ఒక్క ఆధారమూ పోతుంది. ఈ ఆలోచనలలో మునిగివున్న ఆ స్త్రీ దృష్టి ఓడ వైపు మళ్లింది. అందులో ప్రయాణీకులు అత్యంత ఆతురతతో నావ కొరకు ఎదురుచూస్తున్నారు. ఓడలోకి నీరు ప్రవేశిస్తుంది.

ఆమె ఇలా అనుకుంది. వీరందరూ తమ తమ ఇండ్లకు దూరంగా ఉండి వుండవచ్చు. ఈ ఓడ మునిగిపోతే వీరి బంధువులంతా దుఃఖిస్తారు. ఒక వేళ నేనొక్కదాన్ని అయిపోతే ఏదో విధంగా బ్రతుకు వెళ్లదీస్తాను. ఇలా అనుకొని ఆమె తన కుమారునితో, ''నాన్నా! వెళ్లు, భగవంతుడు నిన్ను రక్షిస్తాడు,'' అని చెప్పి పంపింది.

బాలుడు నావను ఓడ వద్దకు తీసుకొని వెళ్లాడు. కొద్దిసేపట్లో అందరి

ప్రాణాలు రక్షింపబడ్డాయి. అదృష్టవశాత్తు అదే ఓడలో అతని తండ్రి కూడా ఉన్నాడు. బాలుడు తండ్రితో కలిసి ఇంటికి వచ్చాడు. ''అమ్మా! చూడు, నీవు నావను తీసికొని వెళ్లేందుకు అనుమతి ఇచ్చావు. నా తండ్రి కూడా అందువల్ల రక్షింపబడ్డాడు,'' అని తల్లితో అన్నాడు.

ఆ స్త్రీ తన భర్త తిరిగివచ్చినందుకు మిక్కిలి సంతోషించింది. బాలుడు ఇతరుల ప్రాణాలు రక్షించటం కోసం వెళ్లాడు. అది అతనికి కూడా సత్ఫలితాన్ని ఇచ్చింది.

ఈ బాలుడే తరువాత కాలంలో ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన అబ్రహాం లింకన్.

# భారతమాత చరణ సేవలో

''యువకుడా! నీకెవరో దుర్బోధ గావించారు. వారి మాటలు నమ్మి నీ నిండు యౌవనాన్ని బలి యిస్తున్నావు. నీవు చేసిన పనికి నీకు ఉరిశిక్ష పడుతున్నది!'' ఆ విప్లవవీరునితో ఒక ఆంగ్లేయుడు అన్నాడు.

''ఎవరు నీకు చెప్పింది?'' నా కర్తవ్యాన్ని నేను స్వయంప్రేరణతో నిర్వర్తించాను. నీవు నన్ను కారణం అడుగుతున్నావు. చెబుతాను విను. మీ దేశస్థుడయిన ఒక ఆంగ్లేయ ఇంజనీరు (విలియమ్స్) మా దేశంలోని ఒక బండివానిని హత్యగావించాడు. వానిని మీరు సత్కరించారు. కాని వయోవృద్ధుడైన మా బాబారావ్ సావర్కార్ శివాజీ మీద కేవలం కొన్ని శ్లోకాలు వ్రాస్తే మీ జాక్సన్ ఏం చేశాడు? ఆయనను అండమానుకు పంపించాడు.





నీకర్థమై ఉంటుంది నేను చేసిన పని ఏ ఉద్దేశ్యంతో చేశానో!''

లక్ష్మణ్ నవ్వుతూ నవ్వుతూ తన యౌవనకుసుమాన్ని భారతమాత్ర చరణాలపై సమర్పించి అమరుడైనాడు.

# డబ్బు యావత్తూ దేశకార్యం కోసం

1908లో ''మానిక్ తలా బాంబు కేసు''లో అవినాశ చక్రవర్తిపై కూడా విప్లవోద్యమంలో పాల్గొన్నట్లు అభియోగం మోపబడింది. ఆయనను ''మున్సిఫ్'' పదవి నుండి తొలగించారు. ఉద్యోగం పోయిన తరువాత శ్రీ చక్రవర్తి హైకోర్టు న్యాయవాదిగా పనిచేయటం ప్రారంభించారు. తరువాత 1914-15లో ఇతర విప్లవనాయకులతో పాటు వారికి కూడా జైలుశిక్ష విధించారు. జైలు నుండి విడుదలై వచ్చిన కొంతకాలానికి తన విప్లవోద్యమ సహచరుడైన సుభాష్ చంద్రడేతో కలిసి ''మహాజన్ అండ్ ట్రేడింగ్ బ్యాంకు''ను స్థాపించారు. కొన్నేండ్లపాటు బ్యాంకు పనిచేసింది. ఆ సమయంలో విప్లవవీరులకు డబ్బు కావలసివచ్చింది. శ్రీ అవినాశ్ ,శ్రీ భూపేంద్రనాథ్ వద్దకు వెళ్లారు.

''దేశకార్యం కొరకు కూడా ధనాభావమా? నా దగ్గర ఎంత ధనం ఉందో బహుశా మీకు తెలియకపోవచ్చు. మీకెంత డబ్బు కావాలంటే అంత తీసుకోండి. నా దగ్గర ఉన్న ఈ డబ్బు అంతా ఎందుకోసం?'' అని చెప్పారు. ప్రోగు చేసి ఉంచిన ఎనుబది వేలరూపాయల ధనరాశిని విప్లవపార్టీకి ఇచ్చి వేశారు. ఇక ఆ బ్యాంకు దివాలా తీయకుండా ఉంటుందా? అటు పిమ్మట ఆయన చేతిలో పైసా లేక

దుర్భర దారిద్ర్య దుఃఖాన్ని అనుభవించారు. ఈ పేదరికం తానుగా తెచ్చి పెట్టుకున్నది. అందుకాయనెప్పుడూ పశ్చాత్తాపపడలేదు.

స్వాతంత్ర్య సంగ్రామకాలంలో తమ సర్వస్వాన్ని అర్పించిన ఇలాంటి ధ్యేయ వ్రతులైన యువకులు మనకై తమ అడుగుజాడలను వదలివెళ్లారు.

# ప్రజాసేవకుల ఆదర్శం

డా.శ్యామప్రసాద ముఖర్జీ అప్పుడు భారతీయ జనసంఘ్‌కు అధ్యక్షులు. పత్రికా విలేఖరులు వారిని కలుసుకొనేందుకు స్టేషనుకు వెళ్లారు. శ్రీ ముఖర్జీ మూడవ తరగతి పెట్టెలో నుండి దిగారు. పత్రికా విలేఖరులు ఆశ్చర్యపోయారు. ''డాక్టర్ సాబ్! మూడవతరగతి పెట్టెలో ప్రయాణం చేసి వస్తున్నారే, మొదటితరగతిలో మీకు రిజర్వేషన్ చేయలేదా? మీకు బాగా అసౌకర్యం కలిగి ఉంటుంది'', అని ఒక పత్రికా విలేఖరి వారిని అడిగారు.

''లేదు, నేను మామూలుగా ఈ తరగతిలోనే ప్రయాణం చేస్తుంటాను. మా పార్టీ పేదపార్టీ అని మీకు తెలుసు. ఇలా ఆదా చేయటం వల్ల మా పార్టీ ఇతర కార్యకలాపాలు నిర్వహించుకొనేందుకు ఆసరాగా ఉంటుంది. నేనే ఆదా చేయకపోతే ఆదా చేయవలసిందని నా సహచరులకు సలహా ఎలా యివ్వగలను?'' డాక్టర్ ముఖర్జీ సమాధానం ఇది.

ప్రజానాయకులకు ప్రేరణాస్రోతస్సుగా ప్రజాసేవకులకు ఉత్తమ ఆదర్శంగా ఉండే ఉదాహరణ ఇది.

# డా.రాజేంద్రప్రసాద్ సౌమ్యస్వభావం

1935 సం.లో జరిగిన సంఘటన. రాజేంద్రబాబు కాంగ్రెస్ అధ్యక్షులుగా ఉన్నారు. ఆయన ఒకసారి ప్రయాగ వెళ్లారు. అక్కడ ఆంగ్లపత్రిక ''లీడర్'' సంపాదకులైన శ్రీ చింతామణిని కలుసుకుందామనే ఉద్దేశ్యంతో వారి కార్యాలయానికి వెళ్లారు. నౌకరుకు తన అడ్రసు ఉన్న చీటీ ఇచ్చి లోనికి పంపారు. అతడు ఆ చీటీని సంపాదకుని బల్లమీద పెట్టి బయటకు వచ్చి కూర్చున్నాడు. సంపాదకుడు తన పనిలో మునిగి ఉన్నాడు. ఆయన దృష్టి ఆ కార్డు మీదకు పోలేదు.

బాబూజీ బయట నిరీక్షిస్తున్నారు. అక్కడికి వచ్చేటప్పుడు వర్షం పడటం వల్ల దారిలో దుస్తులు కూడా తడిసి ఉన్నాడు. లోనుండి పిలుపు రాలేదు. ఈలోగా దగ్గర్లో ఒక కూలీల కొలిమి ఉంటే అక్కడికి వెళ్లి కూర్చున్నారు. చేతులు కాచుకుంటూ దుస్తులు ఆరబెట్టుకుంటూ ఉన్నారు.

కొంచెంసేపటికి శ్రీచింతామణి కార్డును చూశారు. కంగారుపడిపోయారు. మరుక్షణమే పరుగెత్తుకొని బయటికి వచ్చారు. రాజేంద్రబాబు అక్కడ వుంటే కదా కనుపించటానికి? వెతికారు. వారు కూలీల నడుమ కూర్చొని ఉన్నారు. శ్రీచింతామణి సంజాయిషీ ఇచ్చుకోనారంభించారు. ''క్షమించండి. మీరు ఇలా నిరీక్షించాల్సి వచ్చింది. కార్డు నేను చూడనే లేదు.'' రాజేంద్రబాబు నవ్వుతూ, ''ఇందులో క్షమించేందుకు ఏముంది? దుస్తులు ఆరబెట్టుకోవటం కూడా ఒక పనే. మంచిదయింది. ఈలోగా ఆ పని పూర్తయింది.'' అని అన్నారు.

ఆ సంపాదక ''బాబూజీ'' సరళ సౌమ్య విగ్రహాన్ని చూస్తూ ఉండిపోయారు.

# కర్తవ్య పాలనకున్న ప్రాముఖ్యం

ఒకసారి ఒక రైతు గౌతమబుద్ధుని తమ గ్రామానికి రావలసిందని ప్రార్థించాడు. బుద్ధుడు ఆ గ్రామానికి వెళ్లాడు. గ్రామం గ్రామం అంతా వారిని సందర్శించేందుకు వచ్చిపడ్డారు. కాని బుద్ధుణ్ణి ఆ గ్రామానికి ఆహ్వానించిన రైతుకు అదేరోజున ఎద్దుల జత ఎక్కడో మారుపడిపోయింది. రైతుకు ఏం చేయటానికీ పాలుపోలేదు. బుద్ధభగవానుని ప్రవచనం వినేందుకు పోవటమా? తన ఎద్దులను వెతుకుకొనేందుకు పోవటమా? బాగా ఆలోచించుకున్న మీదట అతను తన ఎద్దులను వెతుకుకొనేందుకే నిశ్చయించుకున్నాడు.

గంటల తరబడి వెతికిన తరువాత ఎక్కడో ఎద్దులు దొరికాయి. అలసిసొలసి ఇంటికి వచ్చి, భోజనం చేసి రైతు నిద్రపోయాడు. మర్నాడు సందేహిస్తూ అతడు బుద్ధుని వద్దకు వెళ్లాడు. బుద్ధుడు అతని మనస్సులోని కించను గ్రహించాడు. ''నా దృష్టిలో ఈ రైతు నాకు నిజమైన శిష్యుడు. ఉపదేశాలకంటె ఇతడు కర్మకే ఎక్కువ ప్రాముఖ్యం ఇచ్చాడు. నిన్న తన ఎద్దులను వెతకటానికి వెళ్లకుండా ఇక్కడికి ప్రవచనం వినేందుకు ఇతడు వచ్చి ఉంటే, నేను చెప్పే మాటలు ఇతని చెవికెక్కి వుండేవి కావు. ఇతని మనస్సు ఎటో తిరుగుతుండేది. కర్మమార్గానికి ఎక్కువ ప్రాముఖ్యాన్ని ఇచ్చి ఇతడు మంచిపని చేశాడు'', అని చెప్పారు.

# విచిత్రమైన చికిత్సా పద్ధతి

ఒకరోజున బెర్నార్డ్‌షాకు కొంచెం అస్వస్థతగా ఉంది. ఆయన డాక్టరును పిలిపించాడు. డాక్టరు రొప్పుకుంటూ రోజుకుంటూ వచ్చాడు. ''ఉఫ్, ఈ మెట్లు ఎక్కేటప్పటికి తలప్రాణం తోకకు వచ్చింది. తల పగిలిపోతోంది.'' అని అన్నారు.

డాక్టరు ఇలా ఆపసోపాలు పడుతుంటే షా ఆయనను ఆప్యాయతతో వాలుకుర్చీలో పడుకోబెట్టాడు. తన దగ్గరిపెట్టెలో నుండి ఏదో మందు తీసి యిచ్చి, ''దీన్ని త్రాగండి, వెంటనే ఉపశమనం కల్గుతుంది.'' అన్నాడు. డాక్టరు మందు త్రాగాడు. షా గదిలో పచార్లు చేస్తూ గంభీరంగా, ''డాక్టరు సాబ్! మెట్లు ఎక్కినందువల్లే మీరు అస్వస్థులు కాలేదు. అజీర్ణం చేసే పదార్థాలేవో ఎక్కువగా భుజిస్తున్నట్లున్నారు మీరు. పండ్లు, ఆకుకూరలు, కాయలు మొదలయినవి ఎక్కువ తినండి. కొద్దిగా వ్యాయామం కూడా చేయండి. మీకంటే నాకు రెండింతల వయస్సు. అయినా చూడండి, చురుగ్గా ఆరోగ్యంగా ఉన్నాను,'' అన్నాడు. అంతటితో ఊరుకోక షా వ్యంగ్యంగా ''నేనీ సలహా యిచ్చినందుకు ఫీజు క్రింద నాకు 5 షిల్లింగులు ఇచ్చుకోవాల్సి వుంటుంది,'' అని అన్నాడు.

''క్షమించండి, మిస్టర్ షా!'' డాక్టరు ఇప్పుడు కోలుకొని ఆరోగ్యంగా ఉన్నట్లు కన్పిస్తున్నాడు - ''ఫీజు మీరే నాకివ్వాలి, రెండు పౌనులు.'' అని చెప్పాడు.

''కాని చికిత్స చేసింది నేను కదా మీకు,'' షా ఆశ్చర్యపడిపోయి అన్నాడు.

''లేదు'', డాక్టరు మందహాసం చేస్తూ అన్నాడు, ''నా చికిత్సా పద్ధతే ఇది. నేను రోగి యింటికి వెడతాను. అక్కడ నేనే రోగినవుతాను. రోగి తన్ను తాను నాతో పోల్చుకుంటాడు. తాను అస్వస్థుడిగా వున్నానన్న భ్రమలో నుండి బయటపడతాడు!

# భక్తతుకారాం ఆర్ద్ర స్వభావం

కరువు వచ్చి అప్పటికి నాలుగు సంవత్సరాలయింది. ఎవరింట్లోనూ ఒక ధాన్యపుగింజ కూడా లేదు. జనులు ఊళ్లోనుండి లేచిపోతున్నారు. దగ్గర్లో ఉన్న అడవుల్లో కందమూలాలు వెతుక్కుంటున్నారు. కాలపురుషుడు వికటంగా నర్తిస్తున్నాడు.

పూనాకు సమీపంలో దేహూ అనే పేరుగల గ్రామం ఉంది. ఆ గ్రామంలో ఒక షావుకారు దుకాణం ఉంది. షావుకారు ఎక్కడి నుంచో కొంత ధాన్యం తెచ్చాడు. ఒక్కరోజులోనే ధాన్యం యావత్తు అమ్ముడయిపోయింది. షావుకారుది ఉదారస్వభావం. ఈ ఆపద సమయంలో కొంతధాన్యం తన ఇంట్లో దాచుకుందామనే ఆలోచన, అతనికి కలుగలేదు. "షావుకారు కొట్లో ధాన్యం వచ్చింది. అందరూ వచ్చి తీసుకొని వెళ్ళవలసిందని అతను గ్రామం అంతటికీ కబురు పంపాడు.

కొందరి దగ్గర వుంది, కొందరి దగ్గర ఏమీ లేదు. షావుకారు అందరికీ ధాన్యం ఇచ్చాడు. ఎవరికీ నిరాశ కలిగించలేదు. దుకాణంలో వున్న ధాన్యం ఎగిరిపోయింది. అప్పుడొక స్త్రీ వచ్చింది. ఖాళీగా వున్న దుకాణాన్ని చూస్తూ నిల్చుంది. షావుకారు కూడా ఏమీ చేయలేని స్థితిలో వున్నాడు. దీనంగా చూస్తున్న ఆ స్త్రీమూర్తిని చూసి షావుకారు లేచాడు. అక్కడ క్రింద చెదరిపడివున్న ధాన్యపుగింజలను ప్రోగు చేయటం మొదలుపెట్టాడు. ఈలోగా ఆ స్త్రీ స్పృహ తప్పి పడిపోయింది. కాసేపటికి మరణించింది. ఆ షావుకారు మనస్సులో నుండి ఒక అభంగ్ వెలికివచ్చింది. దాని అర్థం ఇది:-

"ఒక స్త్రీ అన్నం అన్నం" అంటూ ఆకలితో శోష వచ్చి పడిపోయి, మరణించింది. సిగ్గుతో నా శిరస్సు నేలవ్రాలిపోయింది. నేనేం చేయగలను? ఈ దుఃఖంతో క్రుంగిపోయాను. చేసిన కృషి అంతా వ్యర్థమైపోయింది."

ఈ అభంగ్ చెప్పిన షావుకారు తుకారాం. ఈయనే తరువాత కాలంలో మహాధర్మాత్ముడని పేరుపొందాడు. భక్తతుకారాంకు తన వ్యాపారంలో నష్టం వచ్చి అంతా పాడయిపోయినందుకు దుఃఖం లేదు. ప్రజలు ఆకలితో మలమల మాడి మరణిస్తుంటే దుఃఖం కలిగింది. హృదయంలోని ఈ సంవేదన, ఈ ఆర్ద్రత వల్లనే ఆయన ఒక మహాభక్తుడయినారు.

తుకారాం జీవితంలో ఎన్నో కష్టాలు వచ్చాయి. కాని ఆయన నేర్చుకున్న పాఠం ఒక్కటే --

''సుఖములన్నీ స్వప్నతులనము
దుఃఖములుగన నీటి బుడగలు
చూడు మీరెంటిని సమమ్ముగ
ఆదరించుము సర్వదా జను
లందరిని భగవత్ స్వరూపులుగా
సుఖ సపనా దుఃఖ బుద్‌బుదా, దోనోం ఏక సమాన్,
సబ్‌కా ఆదర్ కీజియే, జో భజే భగవాన్)
ఈ బోధను ఆయన ఆజన్మాంతం ఆచరించి చూపాడు.

# ప్రజలు విశ్వాసాన్ని చూరగొనాలి

ఒక పర్యాయం తేజ్‌కుంగ్ కన్‌ఫ్యూషియస్‌ను ఇలా అడిగాడు ''చక్కగా రాజ్యాన్ని పరిపాలించేందుకు ఏ ఏ వస్తువులు అవసరమౌతాయి?''

కన్‌ఫ్యూషియస్ ఇలా సమాధానం చెప్పాడు - ''కావలసినంత ఆహారం, అవసరమైనంత సైన్యం, రాజు. ప్రజలకు విశ్వాసం.''

త్‌జేకుంగ్ అడిగాడు --- '' ఈ మూడు విషయాలు ఒకేసారి ...భించకపోతే, వీనిలో మొదట దేనిని వదలుకోవచ్చు?''

కన్‌ఫ్యూషియస్ చెప్పాడు - ''సైన్యాన్ని''. త్‌జేకుంగ్ మరల అడిగాడు - 'మిగిలిన రెండింటిలో ఏదో ఒకటి వదలుకోవలసివస్తే దేనిని వదలుకోవచ్చు.''

కన్‌ఫ్యూషియస్ చెప్పాడు -- ''ఆహారాన్ని.'' అనంతకాలం నుండి

మానవులు మృత్యుముఖంలోకి ప్రవేశిస్తూనే వున్నారు. కాని ప్రజలకు రాజుపట్ల విశ్వాసం లేకపోయినట్లయితే, ఆ రాజ్యం ఎక్కువ కాలం మనజాలదు.''

# సిద్ధాంత నిష్ఠ

వారణాసిలో ఒక గొప్ప జమీందారు ఇంట్లో శ్రీ శివప్రసాద గుప్త జన్మించాడు. ఆయనకు దైవానుగ్రహం పూర్తిగా వుంది. డబ్బుకు కొదవలేదు. ఆయన డబ్బును సద్వినియోగం చేసేవాడు. ఆయనలో వున్న విశేషం ఇది. న్యాయార్జితమైన తన సంపాదనతో ఆయన కాశీవిద్యాపీఠం, భారతమాత మందిరం, దినపత్రిక 'ఆజ్', జ్ఞాన మండలి - మొదలయిన - అనేక దేశహిత కార్యాలకు విరివిగా ధనం యిచ్చాడు.

వ్యక్తిగతంగా చూస్తే ఆయన దుఃఖితులకు, దళితులకు, విద్యార్థులకు సహాయం చేయటంలో ఎప్పుడూ ముందు ఉండేవాడు. ఆయనకు సిద్ధాంతనిష్ఠ ఎక్కువ. ఆయన మోటారుకారు మీద నంబరుప్లేటు హిందీలో వుండేది. ఇందుకోసం ఒక రూపాయి జరిమానా వేశారు. ఈ కేసులో ఆయన హైకోర్టుదాకా వెళ్లాడు. ఎన్నికలలో నిలబడేందుకు ఆయన ఎప్పుడూ అంగీకరించేవాడు కాదు. దాని వల్ల సిద్ధాంతాలకు భంగం వాటిల్లుతుందని ఆయన భావం. ఆయనకున్న సిద్ధాంతనిష్ఠ అందరికీ ప్రశంసాపాత్రమైంది.

# జీవితంలో ఆనందం

అమెరికాకు ఒక రాష్ట్రపతి ఉండేవాడు - శ్రీ ఉడ్రోవిల్సన్. ఆయన అమెరికా ప్రజలను ఎక్కువగా ప్రేమించేవాడు. ప్రజల స్థితిగతులను కనుగొనేందుకు ఆయన అప్పుడప్పుడు సాధారణ దుస్తులలో తిరుగుతుండేవాడు.

ఒకనాడు ఆయన గుర్రంపై స్వారి చేస్తూ అమెరికా రాజధాని వాషింగ్టన్‌లో తిరుగుతున్నాడు. ఆయన వెంట విశ్వాసపాత్రుడయిన ఒక అంగరక్షకుడు కూడా ఉన్నాడు. రాష్ట్రపతికి బాగా వెనుకగా అతడు గుర్రం మీద వస్తున్నాడు. త్రోవలో రాష్ట్రపతికి 12 - 13 యేండ్ల అల్లరిపిల్లవాడొకడు ఎదురైనాడు. అతను ముఖం చిట్లించుకొని రాష్ట్రపతి వైపు కోపంగా చూశాడు. రాష్ట్రపతి తన గుర్రాన్ని అక్కడే ఆపాడు. కాసేపటికి అంగరక్షకుడు వెనుక నుండి వచ్చాడు. అతను రాగానే రాష్ట్రపతి చెప్పాడు - 'ఆ పిల్లవాడు నన్ను చూసి ఏం చేశాడో తెలుసా?' 'తెలియదు, సర్,' అని ఆ అంగరక్షకుడు భయపడుతూ అన్నాడు. "అతడు నా వైపుచూసి ముఖం చిట్లించి కోపంగా చూశాడు," అని చెప్పాడు రాష్ట్రపతి. అంగరక్షకుని ముఖంలో కత్తివేస్తే నెత్తురు చుక్క లేదు. ఆ పిల్లవాడి కోసం అటూ ఇటూ చూశాడు. కాని ఆ పిల్లవాని పత్తా లేదు, ఎక్కడో మాయమైపోయాడు. రాష్ట్రపతి మళ్ళీ అన్నాడు -- 'నేనేం చేశానో తెలుసా?' 'తెలియదు సర్,' అన్నాడా అంగరక్షకుడు. 'నేను కూడా వాడివైపు చూశాను. సరిగ్గా వాడు చూసినట్లే చూశాను.' రాష్ట్రపతి చెప్పాడు - అంగరక్షకుడికి నవ్వు వచ్చింది.

చిరాకు తెప్పించే చిన్న చిన్న విషయాల పట్ల సరదాగా నవ్వుకొనటం కూడా ఒక కళ. జీవితానికి ఆనందం అందులోనే ఉంటుంది.

# శంకరుని సన్యాస దీక్ష

తల్లి ఆర్యాంబ బాలుడైన శంకరునితో ఇలా అన్నది -- 'నాకున్న సంతానం నీవు ఒక్కడివే. వృద్ధాప్యంలో నీవే కదా నాకాధారం. నీవుసన్యాసం పుచ్చుకుంటానంటే ఎలా అనుమతించగలను, చెప్పు? నీవు సన్యాసం పుచ్చుకుంటే వంశం అంతరించిపోతుంది. పైగా నాకు అంత్యక్రియలు ఎవరు

చేస్తారు? పితృదేవతలకు తిలోదకాలు ఎవరు విడుస్తారు?' బాలశంకరుడు ఖిన్నుడైనాడు; గంభీరుడయినాడు. ఇంతలో ముఖమండలం మీద ఏదో కాంతిరేఖ తొంగిచూసింది. బాలుడు దృఢమయిన ఆత్మవిశ్వాసంతో వినయపూర్వకంగా ఇలా చెప్పాడు -- 'అమ్మా! ఇక్కడ నీవు వంశం నిలవాలనీ, పితరులకు తర్పణాలు వదలాలనీ, శ్రాద్ధకర్మలు చేయాలనీ చెబుతున్నావు. కాని అటుచూడు. బౌద్ధమతం బోధిస్తున్న అహింసా సిద్ధాంతం కారణంగా సమాజం యావత్తు పిరికివాళ్లతో నపుంసకులతో నిండిపోయింది. వైదికధర్మం నష్టమైపోతే రాబోయే తరాలవారు నీకేమి తర్పణాలు వదులుతారు? ఈ ధర్మం రక్షింపబడినట్లయితే నీకు అంత్యేష్టి నేనే స్వయంగా చేస్తాను, హిందూసమాజం అంతా వైదికధర్మాన్ని అనుసరిస్తే మన పితరులకు తర్పణాలు వదలుతూ ఉంటుంది.'

మర్నాడు తల్లి ఆర్యాంబ నదికి స్నానానికై వెళ్లింది. బాలశంకరుడు నదిలోకి లాక్కొని పోబడుతున్నాడు. అతను అరిచాడు -- 'అమ్మా! నా కాలు మొసలి పట్టుకొని లాగుతున్నది. నీవు సన్యాసం పుచ్చుకో వదలిపెడతానంటున్నది'. ఆ తల్లి తల్లడిల్లిపోయింది. వెంటనే అనుమతి ఇచ్చింది. చూస్తుండగానే బాలశంకరుడు ఒడ్డుకు వచ్చాడు. అక్కడి నుండే సన్యాసదీక్ష తీసికొనేందుకు బయలుదేరాడు. ఈ బాలుడే శంకరాచార్యుడయి వైదికధర్మ పునరుద్ధరణ గావించి జగద్గురువుగా ప్రఖ్యాతిగాంచాడు. అమరుడైనాడు.

# లాల్‌బహదూర్ స్వావలంబన

ఒకసారి లాల్‌బహదూర్ శాస్త్రి మిత్రులు కొందరితో కలిసి నావలో కూర్చుని గంగానదిని దాటి ఒక ఉత్సవాన్ని చూచేందుకు వెళ్లాడు. తిరిగి వచ్చేటప్పుడు చూసుకుంటే నావపై వెళ్లేందుకు ఛార్జీలు లేవు. ఈ మాట అతను తన మిత్రులకు చెప్పలేదు. డబ్బులు ఇమ్మని సహాయమూ అడుగలేదు. అతను

కావాలని వెనుకనే ఉండిపోయాడు. మిత్రులందరూ వెళ్లిపోయిన తరువాత ఈదుకుంటూ గంగానదిని దాటాడు. ఇలా అతడు తన స్వయంశక్తి మీద ఆధారపడి ఇంటికి చేరాడు.

# మానవసేవే మాధవసేవ

జపానుకు వెళ్లేటప్పుడు ప్రయాణం మధ్యలో ఓడ మీద స్వామి రామతీర్థకు ఒక అమెరికన్ వృద్ధునితో పరిచయమైంది. ఆ వృద్ధుడు ఎక్కువ సమయం క్రొత్తభాషను నేర్చుకోవటంలోనే గడుపుతున్నాడు. స్వామి రామతీర్థ ఆయనను అడిగాడు --- 'మీరు రాత్రింబవళ్ళు ఏమిటి చదువుతున్నారు?' ఆ వృద్ధుడు వినమ్రతతో సమాధానం చెప్పాడు --- 'నేను భూగర్భశాస్త్రంలో ప్రొఫెసర్‌ను. నాకు ప్రపంచంలోని 11 భాషలలో చదువను వ్రాయను వచ్చు - ఇప్పుడు నేను - రష్యను భాష నేర్చుకుంటున్నాను' 70 - 75 ఏండ్ల వయస్సులో కూడా ఈ 12వ భాషను నేర్చుకోవటం, ఇంతగా దానికోసం కష్టపడటం - ఇదంతా ఎందుకు? ఈ ప్రశ్న స్వామిజీని ఆశ్చర్యంలో పడవేసింది. స్వామిజీ అడిగారు - 'ప్రొఫెసర్ సాబ్, మీరిప్పటికే చాలా చదువుకున్నారు, చదువు చెప్పారు. మీ విశేష జీవితాన్ని భగవద్భజన చేసుకుంటూ గడపాలి. దానితో మీకు శాంతి లభిస్తుంది.'

ఆ వృద్ధుడు కాస్త గొంతెత్తి యిలా జవాబు చెప్పాడు - ' ఈ నడుమనే రష్యను భాషలో భూగర్భశాస్త్రంపై ఒక మంచిగ్రంథం ప్రచురితమయింది. దాన్ని మా భాషలోకి అనువదించి, అమెరికన్ విద్యార్థులకు అందించాలని అనుకుంటున్నాను. నేనీ పనిలో విజయం సాధిస్తే మా దేశానికి ఎంతో ప్రయోజనం చేకూరుతుంది. ఇక పరమేశ్వరారాధన అంటారా, సమాజసేవ

చేయటమే దైవపూజ. సేవ అన్నా ఇదే. సమర్పణ అన్నా ఇదే. ఇదే నా విశ్వాసం.''

ఇలా చెప్పి ఆ వృద్ధుడు మరల రష్యా భాషలోని 'ప్రాథమిక శిక్షణ పుస్తకం'లో లీనమైపోయాడు. స్వామి రామతీర్థ ఆ వృద్ధుని దేశభక్తిని మనస్సులోనే అభినందించాడు.

# నాకు నీ ముఖం చూపకు

చిత్తాడ్‌లో ఒక రాజపుత్రవీరుని కుమార్తె పేరు విద్యుల్లత. ఆమెకు సమరసింహునితో వివాహం నిశ్చయమైంది. సమరసింహుడు కూడా ఒక రాజపుత్ర వీరుడు. వివాహానికి ఏర్పాట్లు జరుగుతున్న సమయంలో అల్లావుద్దీన్ చిత్తాడ్ మీద దాడి చేశాడు. సమరసింహుడు కూడా స్వదేశ రక్షణకై యుద్ధానికి బయలుదేరి వెళ్లాడు.

ఒకనాడు తారలు మినుకు మినుకుమంటున్న వెన్నెల రాత్రివేళ సమరసింహుడు విద్యుల్లత ఇంటికి వచ్చాడు. ఆమెను బయటికి ఏకాంతస్థలానికి పిలిచాడు; ఇలా చెప్పాడు --- 'నీవు లేనిదే నేను జీవించలేను. యుద్ధరంగంలో ఖడ్గప్రహారాల రణగొణ ధ్వనుల నడుమ నాకు నీ నూపుర ఝణ ఝణాత్కారాలు వినిపిస్తున్నాయి. నేనిప్పుడిక యుద్ధభూమికి తిరిగిపోలేను. మన ఇరువురం ఈ చిత్తాడ్ నుండి దూరంగా పారిపోతే బాగుంటుంది. ఏమంటావు?'

తనకు నిశ్చితార్థం జరిగిన వ్యక్తి నోటి నుండి ఈ పిరికిమాటలు వెలువడటంతోనే విద్యుల్లత గర్జించింది -- 'ఏమనుకుంటున్నావు నీవు? నీలాంటి పిరికిపందను నేను వివాహమాడతాననుకుంటున్నావా? లేదు, లేదు.

అలా ఎన్నటికీ జరుగదు. ఒక రాజపుత్రకన్య యుద్ధభూమి నుండి పారిపోయి వచ్చిన పిరికిపంద ముఖంపై ఉమ్మేయటానికి కూడా అసహ్యించుకుంటుంది. అర్థమైందా?' విద్యుల్లత తలుపు వేసుకొని లోనికి వెళ్లిపోయింది. హతాశుడై సమరసింహుడు తిరిగి వెళ్లి అల్లావుద్దీన్ సైన్యంతో చేతులు కలిపాడు. వందలాది ముస్లిం సైనికులను తోడు తీసికొని విద్యుల్లతను తీసికొని పోయేందుకు వెళ్లాడు. అతడు ఆమెను సమీపించి, ఆమె చేయి గ్రహించబోయాడు. ఆమె వెనుకకు అడుగు వేసింది. గర్జించి ఇలా చెప్పింది -- 'నీవు ఒక నీచుడివి - దేశద్రోహివి. నా శరీరాన్ని తాకి నన్ను అపవిత్రం చేయవద్దు. శత్రువులతో కుమ్మక్కు అయి నా వద్దకు వచ్చావు. సిగ్గు లేదా నీకు? వెళ్లు. ఇక ఎప్పుడూ నీ ముఖం నాకు చూపవద్దు.'

విజయగర్వంతో ఉన్న సమరసింహుడు ముందుకడుగు వేయబోయాడు. విద్యుల్లత మెరుపువేగంతో కత్తిని లాగి తన గుండెల్లో పొడుచుకుంది. అపవిత్రమైన సమరసింహుని హస్తాలు ఆమెను స్పృశించలేకపోయాయి. ఆమె దివ్యలోకాలను అలంకరించింది

# సాంస్కృతిక వారసత్వాన్ని కాపాడుకోవాలి.

చైనా యాత్రికుడు హుయాన్‌సాంగ్ తన భారతయాత్ర ముగించుకొని సముద్రమార్గం ద్వారా తన దేశానికి తిరిగి వెడుతున్న సమయంలో జరిగిన సంఘటన ఇది. కొందరు భారతీయ యువకులు ఆ సమయంలో నావపై హుయాన్‌సాంగ్ వెంట వున్నారు. వారు తీసికొని వెడుతున్న సామానులలో విలువైన భారతీయ గ్రంథాలున్నాయి. మంత్రద్రష్టలైన వందలాది మహాపురుషులు, తత్త్వవేత్తలు అనేక సంవత్సరాల పర్యంతం కఠోర తపస్సు చేసి

రచించిన గ్రంథాలు అవి. అవి భారతీయ సంస్కృతికి భాండాగారాలు.

మార్గంలో సముద్రతరంగాలు ఎత్తుగా లేస్తూ పరస్పరం ఢీకొంటున్నాయి. భయంకరమైన తుఫాను చెలరేగింది. నావ తుఫాను నడుమ ఇరుక్కొని పోయింది. నావలోనికి నీరు రాసాగింది. సముద్రపుటలల తాకిడికి అది అటూ ఇటూ ఊగిపోతోంది. ప్రాణాలు రక్షించుకొనడం ఎలాగా అనే ప్రశ్న ఎదురయింది. హుయాన్‌సాంగ్ ఆత్మరక్షణకై ఆ విలువైన గ్రంథాలన్నింటినీ సముద్రంలోకి త్రోసివేద్దామనే ఆలోచనలో వున్నాడు. అప్పుడు భారతీయ యువకులలో ఒక వ్యక్తి ఆత్మవిశ్వాస పూరితమయిన కంఠంతో ఇలా చెప్పాడు--

'లక్షలాది సంవత్సరాల కృషి ఫలితమైన ఈ గ్రంథరాశి భారతీయులకు అమూల్యనిధి. ఈ జ్యోతిఃపుంజం దేశవిదేశాలలో భారతీయ సంస్కృత మహాత్మ్యన్ని చాటి చెప్పటానికీ, అజ్ఞానాంధకారంలో కొట్టు మిట్టాడుతున్న కోట్లాది మానవ హృదయాలను ప్రకాశింపజేయటానికీ బయలుదేరి వెడుతోంది. దీనిని ఈ సాగరోత్తుంగ తరంగాలకు బలి యిచ్చేందుకు వీలులేదు.'

'జయ్‌స్వదేశ్, జయ సంస్కృతి మాతా,' అనే నినాదంతో ఆ యువకుడు ఉవ్వెత్తున లేస్తున్న సముద్రపుటలల ఒడిలోకి దూకి తనను తాను సమర్పించుకున్నాడు. నావలో బరువును తగ్గించే ఉద్దేశ్యంతో ఆ యువకులందరూ ఒకరి తరువాత ఒకరు ఇలా ఆ జలరాశిలోని అగాధపులోతుల్లోకి వెళ్లిపోయారు. హుయాన్‌సాంగ్ దిగ్భ్రాంతితో చూస్తూ ఉండిపోయాడు. అతని నయనాలు అశ్రుపూరితాలయినాయి. ఆ సాంస్కృతిక పూజారుల పట్ల, ఆ అనన్య రాష్ట్ర సమారాధకుల పట్ల గౌరవభావంతో అతని శిరస్సు వంగింది. భారతదేశపు ఈ గౌరవమయ గాథాపూరిత హృదయంతో అతను తన నిర్దిష్ట స్థానానికి ముందుకు సాగిపోయాడు.

# దైవం కంటె దేశం ముందు

నోబుల్ బహుమతి పొందిన విశ్వకవి రవీంద్రనాథ టాగోర్ జపాన్ పర్యటనలో ఉన్నాడు. ఒక విద్యాలయంలోని బాలుర కార్యక్రమానికి వారిని ఆహ్వానించారు. ఆయన అక్కడి బాలురను ఒక ప్రశ్న అడిగాడు ---

'మీరు ఏ మతాన్ని అనుసరిస్తారు?' జవాబు వచ్చింది, 'బౌద్ధమతం' అని. 'బౌద్ధమతప్రవక్త అయిన బుద్ధభగవానుడు జన్మించింది భారతదేశమని మీకు తెలుసునా?' 'అవును, తెలుసు.' బాలురు అందరూ సులభంగానే సమాధానం చెప్పారు.



రవీంద్రనాథ టాగోరు తరువాత వారిని ఒక చిక్కుప్రశ్న వేశారు -- 'ఊరకనే ఊహించుకోండి. మాటవరుసకు గౌతమబుద్ధుడే స్వయంగా సైన్యానికి నాయకత్వం వహించి, మీ జపాను దేశం మీదికి దండెత్తి వచ్చాడనుకుందాం. అప్పుడు మీరు ఏం చేస్తారు?



'ఒక బాలుడు తటాలున లేచి నిల్చున్నాడు. రోషంతో సమాధానం చెప్పాడు - 'మేము బుద్ధుణ్ణే ఎదిరిస్తాం. బుద్ధభగవానుడి విగ్రహాలు కరగించి తుపాకి గుండ్లుగా తయారుచేస్తాం. దురాక్రమదారుణ్ణే, అతని సైన్యాన్ని భస్మం చేస్తాం.'

గురుదేవుడు ఈ సమాధానం విన్నాడు. ఆ బాలురి హృదయాలలో ఆయనకు జపాను దేశ ఉజ్జ్వల భవిష్యత్తు కన్పించింది. వారి దేశభక్తి భావనకు ఆయన శిరస్సు నమ్రమైంది.

# వీర బాలిక మైనాదేవి

1857లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామ సేనానాయకుడు నానాసాహెబ్ పీష్వే బిఠూర్ వదలి వెళ్లిపోయాడు. ఆయన కుటుంబం అక్కడే దుర్గంలోని రాజభవనంలో ఉండేది.

కాన్పూరులో పెద్దయెత్తున హత్యాకాండ గావించి ఆంగ్లేయసైన్యం బిఠూర్ పై కూడా దాడి చేసింది. నానాసాహెబ్ మహల్‌పై ఫిరంగులు గురిపెట్టింది. రాజమహలు కొద్దిక్షణాలలోనే ధ్వంసమయింది. శిథిలాలు మిగిలాయి. కోటలో ఒక శివాలయం ఉంధి. కొందరు సైనికులు దానిని కూల్చేందుకు సిద్ధమైనారు. వెంటనే ఒక కఠిన స్వరం విన్పించింది -- 'జాగ్రత్త!' ఒక వీరబాలిక కంఠస్వరం అది. ఆమె పేరు మైనా - నానాసాహెబ్ కుమార్తె. ఆ బాలిక సైనిక దుస్తుల్లో ఉంది. ఆమె తుపాకి గురిపెట్టి నిల్చుంది.

ఆంగ్లేయ సైనికాధికారి ఆ బాలికను గురించిన వివరాలు తెలుసుకున్నాడు. ఆమెను బంధించారు. నానాసాహెబ్‌ను గురించి ఆమెను ప్రశ్నించారు. బెదిరించారు, భయపెట్టారు. కాని ఆ బాలిక నోరు మెదపలేదు. భయపడలేదు. వారిని లెక్కపెట్టలేదు. చివరకు ఆమెను లాక్కొనిపోయి గట్టిగా కట్టిపడేశారు. జనరల్ ఔట్రమ్ ఆజ్ఞల మేరకు ఆమెను ఆ కసాయి సైనికులు మండుతున్న అగ్నిలో విసరివేశారు. సజీవదహనం చేశారు. అగ్ని భగభగమండింది. జ్వాలలు పైకి లేచాయి. మైనాదేవి దేశధర్మ సంరక్షణ కొరకై బలిదానమైపోయింది. అమరత్వాన్ని పొందింది. అద్వితీయమైన ఆమె వీరత్వం, నిర్భయత్వం, ఉజ్వల దేశభక్తిని చూచి ఆంగ్లేయ సైనికుల తలలు నేలకు వ్రాలిపోయాయి.

# సమర్పణ భావం

మురికి కాలువలో గురునానక్ దేవుని గ్లాసు పడిపోయింది. ఆయన శిష్యులను చూచి, 'ఈ గ్లాసును పైకి తీసుకొనిరండి,' అని అన్నారు. శిష్యులు గ్లాసును పైకి తీసికొనివచ్చేందుకు పాకీ మనిషిని పిల్చుకొనిరావటానికై పరుగులు తీశారు. వారిలా చేయటం గురునానక్‌కు అసంతృప్తి కలిగించింది. వారు శిష్యులకు ఇలా బోధిస్తుంటారు --- 'కర్తవ్య కర్మయే పూజ. స్వావలంబనయే నిజమయిన పురుషార్థం.' ఇంతటి చిన్నపని చేయటానికి కూడ శిష్యులు వెనుకాడుతుంటే చూచి గురుదేవునికి నిరాశ కలిగింది.

ఆయనకు 'లహిణా' అనే శిష్యుడున్నాడు. అతను వెంటనే లేచాడు. గ్లాసు పైకితీసేందుకు మురికికాలువలోకి వంగాడు. గ్లాసు కాలువలో అడుగుభాగాన వుంది. లహిణా తన దుస్తులు పైకెత్తుకొని కాలువలో దిగాడు. చేతులు ఆ మురికినీటిలో పెట్టి గ్లాసు పైకి తీశాడు. ఇంతలో మిగిలిన శిష్యులు పాకీవానిని పిల్చుకొని వచ్చారు.

గురునానక్ దేవుడు శిష్యులందరి ముందు లహిణాను ప్రశంసించారు. మిగిలిన శిష్యులను మందలించలేదు. అయినా ఆయన మనస్సులోని భావం వారందరికీ అర్థం అయింది. శ్రద్ధ, నిష్ఠ, పూజాభావనతో పనులు చేయాలని గురుదేవుడు వారికి బోధిస్తున్నారు.

లహిణా అనే ఈ శిష్యుడే తరువాత కాలంలో గురుఅంగద దేవునిగా ప్రసిద్ధికెక్కాడు.

# మరల పోరాడుదాం

సోలన్ నదీతీరంలో వజ్రాలగని వున్నదని ఋజువులు లభించాయి. రైఫిల్ దానిని వెతకటంలో మునిగిపోయాడు. ఒక యేడాది పూర్తి అయింది. అహర్నిశలూ కృషి చేశారు. కాని ఫలితం లేదు. ఇంత ప్రయత్నించినా లాభం లేకపోయిందే అనే ఆలోచన కలిగింది. అతనిలో నిరాశానిస్పృహలు చోటు చేసుకున్నాయి. పనిచేయటం ఆపివేసి అతడు తిరిగిపోదామన్న నిశ్చయానికి వచ్చాడు. మరలివెళ్లేందుకు ప్రయత్నాలు మొదలైనాయి. పోతున్న క్షణంలో కూడా అతను ప్రయత్నాలు కొనసాగిస్తూనే వున్నాడు. మనస్సు చెబుతోంది - 'ఇంకొక్కసారి ప్రయత్నించి చూడు.' తిరిగి వెళ్లేరోజున రైఫిల్ మరోమారు ప్రయత్నించి చూశాడు. ఎందుకో ఒక నూతనోత్సాహం అతనిలో పరవళ్లు త్రొక్కింది. అతను మళ్లీ పనిలో మునిగిపోయాడు. చిట్టచివరకు అతనికి ఒక్క వజ్రం చేతికి దొరికింది. ఆనందంతో అతను చిందులు వేశాడు. 'ఇదిగో, దొరికింది', అనే మాట అతని నోటి నుండి వెలువడింది.

అతడిప్పుడు మరోమూల నుండి నది అంతటినీ సర్వేక్షణ చేశాడు. గుట్టల కొలది వజ్రాలు దొరికాయి. అతడు గొప్ప ధనవంతుడై పోయాడు. రైఫిల్ తన కార్యాలయంలో ఒక బోర్డు మీద వ్రాయించాడు --- 'నిరాశాయుత క్షణాలలో కూడా ఆలోచిస్తూ వుండు, 'మరోసారి పోరాడుదాం' అతడీ వాక్యాన్ని రోజూ చదువుకుంటుంటాడు.

రైఫిల్ లాంటి వ్యక్తులు పరిస్థితులకు దాసులుగా ఉండరు. పరిస్థితుల వీపుపైకెక్కి నిల్చుని విజయపతాకాన్ని ఎగురవేస్తారు.

# ఆత్మవిశ్వాసం

భయంకరమైన తుఫాను వచ్చింది. గేలీలో సరస్సులో నీరు పైపైకి ఎగసిపడుతోంది. నావలు ఎగురుతున్న అలల తాకిడికి అటూ ఇటూ ఊగిపోతున్నాయి. నీళ్లు నావలలోకి రాసాగాయి. ప్రయాణీకులు భయభీతులైపోతున్నారు. అందరికీ కంగారుగా వుంది.

ఒక నావలో ఒక మూల ఒకానొక వ్యక్తి శాంతంగా, నిశ్చింతగా నిద్రలో మునిగివున్నాడు. ఈ గొడవ విని అతడు మేల్కొన్నాడు. పరిస్థితిని ఆకళింపుకు చేసుకున్న పిదప సహచరులతో చెప్పాడు - 'ఇందులో భయపడవలసిన విషయమేముంది? తుఫానులు వస్తుంటాయి. మనుష్యులు మరణిస్తుంటారు. తత్తరపడిపోవలసిన అగత్యం లేదు. వినండి. నేను విశ్వాసంతో చెబుతున్నాను. ఈ తుఫాను కొంచెం సేపటికి శాంతిస్తుంది. సోదరులారా, విశ్వాసం అనేది ఉండాలి. అది తుఫానుకంటె శక్తిమంతమైనట్టిది.' ఇలా చెప్పి నిశ్చింతగా వున్న ప్రయాణీకుడయిన ఆ ఏసుక్రీస్తు కండ్లు మూసుకున్నాడు. తరువాత లేచాడు. సరస్సు నీటిని స్పృశించి యిలా అన్నాడు -- 'మూర్ఖుడా! శాంతించు'. ఆశ్చర్యకరంగా తుఫాను శాంతించింది. నావలు ఊగులాడటం మానివేశాయి. అల్లరి పిల్లవాడి మాదిరిగా తుఫాను భయపడి నెమ్మదినెమ్మదిగా ఆగిపోయింది. అంతా మళ్లీ స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నారు. క్రీస్తు ప్రయాణీకులకు వివరించాడు, 'అత్యంత భయంకర పరిస్థితులు ఎదురైనప్పటికీ విశ్వాసాన్ని ఆశ్రయించుకొని ఉండు. మృత్యుదేవత శిరస్సుపై నర్తిస్తున్నా కూడా అట్టి వ్యక్తి ప్రశాంతంగా ఉండగలడు.

# ఉద్ధామ్‌సింగ్ సాహసం

పెషావరులో రత్నాదేవి తన భర్తతో పాటు వైశాఖ స్నానం చేయటానికి అమృతసర్ వచ్చింది. జలియన్‌వాలాబాగ్‌లో ఆంగ్లేయులు చేసిన హత్యాకాండలో ఆమె భర్త చనిపోయాడు. ఆ నిర్భాగ్యురాలు గుండెలు బాదుకొని ఏడుస్తోంది. ఆమెకు తన భర్త శవం కావాలి. ఒంటరిగా ఒక అబల ఆ ప్రదేశంలో శవాన్ని వెతుకుకోవటం ఎలా? నాలుగువైపుల కాపలా ఉంది. అందులోకి ఎవరినీ ప్రవేశించనీయటం లేదు.

యువకుడైన ఉద్ధామ్‌సింగ్ ఆ త్రోవన వెడుతున్నాడు. హృదయవిదారకమైన ఆ స్త్రీ రోదనస్వరాన్ని విని ఆమె వద్దకు వచ్చాడు. విషయం అంతా తెలుసుకున్నాడు. 'సోదరీ, ఏడవటం వ్యర్థం. నీకు నీ భర్త శవం కావాలి కదా. అయితే పద. నేను నీ వెంట వచ్చి ఆ ప్రదేశంలో వెతుకుతాను. నేను ఒక్కడినే శవాన్ని మోసుకొని రాగలను. కాని అతనిని గుర్తుపట్టలేను. అయితే నీవు నాకు ఒక మాట ఇవ్వాలి. ఏడవకూడదు. శబ్దం వినిపించిందంటే కాపలా వారు కనిపెట్టేస్తారు.' ఉద్ధామ్‌సింగ్ మాటలతో రత్నాదేవి కన్నీటిని తుడుచుకొన్నది. ఇరువురూ నిశ్శబ్దంగా ఆ ప్రదేశంలోకి ప్రవేశించారు. కాపలాదారులు ఎవరూ వారిని గమనించలేదు.

1200 శవాలు అక్కడ పడివున్నాయి. ఆ ప్రదేశమంతా నెత్తురు మడుగైపోయింది. చుట్టూ గాఢాంధకారం. ఈ చేతికి ఆ చేయి కనిపించటం లేదు. శవాలను పరిశీలిస్తూ, కొన్నిటి నుండి తొలగిపోతూ, కొన్నింటిని దాటుకుంటూ యిరువురూ తుట్టతుదకు ఒక శవం దగ్గర వెళ్ళి నిల్చున్నారు.

నెత్తురుతో నిండిన ఆ శవం ముఖం వైపు చూడగానే రత్నాదేవి ఒక్కసారిగా కేక పెట్టింది. అది ఆమె భర్త యొక్క శవమే. తాను ఏడవనని యిచ్చిన మాటను ఆమె మర్చిపోయింది.

రత్నాదేవి వేసిన కేక వినగానే కాపలావాడు తన తుపాకీని ఆమె వైపుగా గురిపెట్టాడు. ఉద్ధామ్‌సింగ్‌కు తుపాకీ గుండు తగిలి గాయమయింది. అప్పుడు సరిగా అర్ధరాత్రి అయింది. ఉద్ధామ్‌సింగ్ సాహసాన్ని కోల్పోలేదు. తలపాగా తీసి గాయమయిన తన భుజానికి గట్టిగా కట్టుకున్నాడు. రత్నాదేవితో కలిసి ఆ శవాన్ని ఏదో విధంగా ఆ ప్రదేశం నుండి బయటకు ఎత్తుకొనివచ్చాడు. నగరంలో అప్పుడు కర్ఫ్యూ పెట్టారు. ఉద్ధామ్‌సింగ్ ఈ పని అంతా పూర్తి చేసుకొని యింటికి చేరుకున్నాడు. రత్నాదేవి ఉద్ధామ్‌సింగ్‌ను ఆశీర్వదించింది.

# సత్సంగ మహిమ

కొంత కాలంపాటు సత్సంగము లభించినా అది ఎంతటి ప్రభావాన్ని చూపిస్తుందో అమరవీరుడు 'ఆర్యముసాఫిర్' పండిత లేఖరామ్ జీవితం చూస్తే తెలుస్తుంది. ఆర్య సమాజంలో ఆయన గొప్ప నాయకుడు. గ్రామగ్రామానికి వెళ్లి ఆయన ప్రచారం చేస్తుండేవాడు. ఒక గ్రామంలో ఆయన ఉపన్యాసం యిస్తుంటే ముగలా అనే ఒక దోపిడీదొంగ కూడా వచ్చి ఆ ఉపన్యాసం వినటం తటస్థించింది. అతని అనుచరులు కూడా ఇతర వ్యక్తులతోపాటు కలిసి కూర్చున్నారు. గ్రామప్రజలు 'ముగలా'ను చూశారు. గుర్తించారు. వారికి పై ప్రాణాలు పైనే పోయాయి. వారి కాళ్ల క్రింద భూమి జారిపోయినట్లు అనిపించింది. వారు ఒక్కొక్కరే లేవసాగారు. పండిత లేఖరామ్ ఉపన్యాసం కొనసాగుతోంది. ప్రజలు ఒక్కొక్కరు లేచిపోవటం మొదలుపెట్టారు. ఏమిటి

ఇలా జరుగుతున్నదని లేఖరామ్‌కు ఆశ్చర్యమేసింది. నెమ్మదిగా అందరూ వెళ్లిపోయారు. ముగలా, అతని అనుచరులు మాత్రమే మిగిలారు. పండిత లేఖరామ్ ఉపన్యాసం ఇస్తూనే వున్నారు. ఆయన కర్మయోగాన్ని గురించి చెబుతూ, ఇలా అన్నారు. 'అవశ్యమేవ భోక్తవ్యం కృతం కర్మ శుభాశుభం.' ఉపన్యాసం పూర్తి అయింది. ముగలా ఆ పండితుని వద్దకు వెళ్లి, 'మీరెవరు?' అని అడిగాడు.

'నేను లేఖరామ్‌ను', అని పండితుడు సమాధానం చెప్పాడు. 'నేను ఏకాంతంగా మిమ్మల్ని కొన్ని విషయాలు అడుగుదామనుకుంటున్నాను. నేను మిమ్మల్ని కలుసుకోవచ్చా?' అని ఆ దొంగ అడిగాడు. 'తప్పక కలుసుకోవచ్చు. నా వసతి ఆర్య సమాజంలో. అక్కడికి రావచ్చు.' అని లేఖరామ్ చెప్పాడు.

రాత్రివేళ దొంగ అతని సహచరులతో సహా ఆర్యసమాజ భవనంలో వెళ్లి లేఖరామ్‌ను కలుసుకున్నాడు. గ్రామస్థులందరికీ భయం చేసింది. ఏదో ఆపద ముంచుకొని వచ్చిందని వారనుకున్నారు. ఈ దొంగలు పండిత్‌జీని దోపిడీ చేయటానికి వచ్చారని భావించారు. కాని ముగలా చేతులు జోడించి పండిత్‌జీని అడిగాడు - 'మనం చేసిన ప్రతి కర్మ యొక్క ఫలాన్ని అనుభవించవలసిందేనని మీరు చెప్పారు కదా. ఇది సత్యమేనా?' పండిత్‌జీ ఇలా చెప్పారు, 'నూటికి నూరుపాళ్లు సత్యమే' ముగలా అడిగాడు, 'ప్రతి కర్మ యొక్క ఫలాన్ని అనుభవించక తప్పదా? దాని నుండి రక్షించుకొనే ఉపాయం ఏమీ లేదా?' పండిత్‌జీ చెప్పారు, 'లేనే లేదు' ముగలా అప్పుడడిగాడు, 'అయితే నా సంగతి ఏమిటి? నేను చాలా యేండ్లు దోపిడీలు దొంగతనాలు చేస్తున్నాను.' పండిత్‌జీ ఇలా అన్నారు - 'ఈరోజు నుండి వదలిపెట్టు. రేపు నీవు ఆర్యసమాజ భవనానికి

రా. నీకు యజ్ఞోపవీతధారణ జరుపుతాను. అటు తరువాత ధర్మమార్గంలో నడుచుకో.'

ముగలా, అతని అనుచరులు మర్నాడు ఆర్యసమాజ భవనానికి వెళ్లారు. వారందరి జీవితాలు మారిపోయాయి. సత్సంగ మహిమ అంటే ఇలా వుంటుంది.

# లేమిలో కలిమి

15 యేండ్ల వయస్సులో తీర్థరామ్ 10వ తరగతి పాస్ అయినాడు. పంజాబ్ ప్రాంతం మొత్తంలో మొదటివాడుగా వచ్చాడు. బోర్డువారు అతనిని ప్రోత్సహించేందుకు ఉపకార వేతనం ఇచ్చారు. తీర్థరామ్‌ను పై చదువులు చదివించాలనే కోరిక తండ్రికి లేదు. అయినప్పటికీ తన స్వంతశక్తిపై ఆధారపడి తీర్థరామ్ కాలేజీలో చేరాడు. తనకు లభించే ఉపకారవేతనాన్ని కాలేజీ ఫీజు క్రింద చెల్లించేవాడు. పుస్తకాలు కొనుక్కుండేవాడు. భోజనం వగైరాల కోసం ట్యూషన్లు చెప్పుకొని ఎలాగో అలా నెట్టుకొనిపోదామని నిశ్చయించుకున్నాడు.

అతని ఆదాయం రోజుకు మూడుపైసలు. దీనితోనే అతను తృప్తి పడేవాడు. లాహోరు వంటి నగరంలో ఇంత తక్కువ డబ్బుతో నివసించటం ఎంతో కష్టమో ఊహించుకోవచ్చు. తీర్థరామ్ ఒక హోటల్లో రొట్టెలు తినేవాడు. రొట్టెలకు రెండు పైసలు చెల్లిస్తుండేవాడు. రొట్టెలలో పప్పు ఊరకనే యిస్తుండేవారు. కొంతకాలం సాగింది. హోటలు వాడు తన నియమాలు మార్చివేశాడు - పప్పు ఊరకనే యివ్వటం జరుగదని చెప్పాడు. ఇక తప్పక తీర్థరామ్ సాయంత్రం భోజనం చేయటమే మానివేశాడు.

ఒకసారి కొట్లో ఏవో సామానులు కొనుక్కోవటానికి వెళ్లాడు తీర్థరామ్. కొట్లో నుండి వెనుకకు తిరిగివస్తుంటే కాలి చెప్పు తెగి కాలువలో పడిపోయింది. కాలువ లోతుగా వుంది. చెప్పు మునిగిపోయి కొట్టుకొనిపోయింది. విరక్తభావంతో తీర్థరామ్ మిగిలిన ఒక చెప్పు చేత్తో పట్టుకొని ఇంటికి వచ్చాడు. రెండోచెప్పు ఎక్కడో సంపాదించాడు. అది ఈ చెప్పుకు జతగా లేదు. జతకుదరని చెప్పులు వేసుకొని చాలాకాలం కాలక్షేపం చేశాడు. తోటి విద్యార్థులు ఎగతాళి చేస్తుండేవారు. అతడు లక్ష్యపెట్టేవాడు కాదు. నిర్వికారంగా తపోమయమయిన జీవితాన్ని గడుపుతుండేవాడు. అతను ఎంతో శ్రద్ధతో చదువుకొనేవాడు. అన్ని తరగతుల పరీక్షలలోను ఎప్పుడూ ప్రథమస్థానంలోనే ఉత్తీర్ణుడవుతూ ఉండేవాడు. లేమిగా వున్న రోజులలో అతని హృదయం ఎప్పుడూ సద్భావములతో నిండి వుండేది.

తనకున్న యోగ్యతను అతను వ్యక్తిగత లాభం కోసం ఎన్నడూ ఉపయోగించుకోలేదు. దేశధర్మముల నిమిత్తం అతను తనను తాను సమర్పించుకున్నాడు. తీర్థరామ్ స్వామి రామతీర్థ అయినాడు. దేశవిదేశాలలో భగవంతుని సేవకై తన జీవితాన్ని వినియోగించాడు.

# కర్మయోగసాధన

జల్పాయిగురీలోని తేయాకుతోటలో 13 యేండ్లబాలుడు కూలీగా పనిచేస్తుండేవాడు. బీదవాడు. తండ్రి లేడు. పేరు భీమచంద్ర ఛటర్జీ. ఈ బాలుడు రోజూ 18 గంటలు పనిచేస్తుండేవాడు. ఆ రోజుల్లో అతని జీతం నెలకు 15 రూపాయలు. అందులో 10 రూపాయలు తల్లికి యిస్తుండేవాడు.

ఒకరోజు తల్లి అతనితో ఇలా చెప్పింది - 'భీమా, మనకు ఇల్లు జరగటం కష్టంగా వున్న మాట నిజమే. నీకు ఒకటి చెప్పదల్చుకున్నాను. నీవు ఈ ఉద్యోగాన్ని వదలిపెట్టు. మనం ఎన్ని కష్టాలయినా పడదాము. నీవు బెంగపెట్టుకోకు. నీవు చదువుకొని పైకి రావాలి. జీవితంలో ఏదైనా గొప్పకార్యాన్ని సాధించాలి. ఇదే నాకున్న కోరిక.'

కుమారుడు తల్లికి నమస్కారం చేసి ఆమె అనుజ్ఞ తీసుకున్నాడు. ఇల్లువాకిలి తాకట్టు పెట్టి అతను చదువుకొనటం మొదలుపెట్టాడు. జీవితంలో ముందు ముందుకు సాగిపోయాడు. లండన్‌లో చార్టర్డు ఎలెక్ట్రికల్ ఇంజనీరింగు పట్టాను పుచ్చుకున్నాడు. బాగా పైకి ఎదిగిపోయాడు. అత్యుత్తమమైన ఇంజనీరుగా పేరు ప్రఖ్యాతులు సంపాదించాడు. రుజకీ ఇంజనీరింగు కాలేజీలో ప్రొఫెసర్లు కూడా అతని వద్ద ట్రయినింగు పొందేవారు.

కాశీ హిందూ విశ్వవిద్యాలయంలోని ఇంజనీరింగు విభాగం నమూనాను తయారుచేసింది భీమచంద్ర ఛటర్జీయే. ఇంతేకాదు. 20 యేండ్లపాటు రోజుకు 16 గంటల చొప్పున, మరొక 5 యేండ్లపాటు రోజుకు 20 గంటల చొప్పున పనిచేసి ఆయన ఒక బృహద్గ్రంథాన్ని రచించాడు. దీనిలో 30 ఖండములున్నాయి. 15000 పేజీలున్నాయి.

కర్మయోగ సాధనలో ఉన్న అద్భుతం ఇది.

# స్వస్థాన వేషాభిమానం

బాలుడు క్రైస్తవ మిషనరీ స్కూలు వదలిపెట్టి ఒక క్రొత్త భారతీయ విద్యాలయంలోకి ప్రవేశించాడు. అక్కడి ప్రధానాచార్యులు శ్రీ వేణి మాధవదాస్ పంచె - లాల్చీ ధరించి సాదావేషంలో ఉన్నాడు. ఆయనను చూచి బాలుని మనసులో ఒక ప్రశ్న తలెత్తింది. విద్యాలయ ప్రధానాచార్యుడే ఇలా పంచె - లాల్చీ

ధరించి బడికి వస్తుంటే నేను మాత్రం అలా ఎందుకు రాకూడదు? నేను ఈ బడిలోని విద్యార్థినే కదా! బాలుడు ఇంటికొచ్చాడు. అక్కడ అతడి దృష్టి స్వామి వివేకానంద చిత్రపటంపై పడింది. ఇట్టి దుస్తులు ధరించి వివేకానందుడు ప్రపంచమంతటిలో ఖ్యాతికెక్కాడు. నాకు ఈ కోటు - ప్యాంటూ ఎందుకు? బాలుని మనస్సులో భారతీయ వేషధారణ విషయంలో పట్టుదల ఏర్పడింది. మర్నాడే సుభాష్ బోస్ పంచె - లాల్చీ ధరించాడు. ఆ వేషాన్ని చూచి తండ్రి కోపగించాడు. కాని బాల సుభాష్ దృఢంగా చెప్పాడు - 'నాన్నగారూ, ఇది మన జాతీయ వేషం. ఇది నా ఒంటికి బాగుండలేదా? మనం భారతీయులం. మనం మన దుస్తులు ధరించాలి. ఆంగ్ల దొరలలాగా మనం ఎందుకు తయారుకావటం?

బాల్యంలోనే ఈ విధంగా సుభాష్ బోస్‌కు భారతీయ వేషభాషల పట్ల అభిమానం ఉండేది.

# జన్మసిద్ధ దేశభక్తి

దేశం కొరకు సర్వస్వార్పణ చేయాలనే భావం అకస్మాత్తుగా కలుగదు. దాని బీజాలు పుట్టినప్పుడే మొలకెత్తుతాయి. కేశవుడు అలాంటి జన్మసిద్ధ దేశభక్తి కలిగిన బాలుడు. బాలకేశవుడు నాగపూర్‌లో పాఠశాలలో చదివేటప్పుడు తోటి విద్యార్థులకు ఒక సవాల్ విసిరాడు - 'ఈరోజున మనం తనిఖీ కోసం వచ్చే ఆంగ్లేయ ఇన్‌స్పెక్టర్‌ను 'వందేమాతరం' నినాదంతో స్వాగతం పలుకుదాం.'

ఇన్‌స్పెక్టరు తరగతులలోకి ప్రవేశించగానే కేశవుని నాయకత్వంలో 'వందేమాతరం' నినాదంతో ఆయనకు స్వాగతం పలికారు. ఇన్‌స్పెక్టరు 'వందేమాతరం' నినాదాన్ని విని అగ్గి-బుగ్గి అయినాడు - 'ఈ పిచ్చికేకలు

ఏమిటి? నేను ఈ విద్యాలయాన్ని మూసివేయిస్తాను' వెంటనే అంతటా నిశ్శబ్దం అలముకుంది - ప్రధానాచార్యుడు కేశవుణ్ణే పిలిచి క్షమాపణ చెప్పమని కోరాడు. స్కూలు క్షేమం కోరి ఇది చేయక తప్పదని నచ్చచెప్పారు. బాలకేశవుడు స్వాభిమానంతో ఇలా అన్నాడు - 'ఎందుకోసం క్షమాపణ? నేను మాతృవందనం చేశాను. ఏ అపరాధము చేయలేదే! నేను మరల ఒకసారి ఇప్పుడు మరింత ఉచ్ఛస్వరంలో 'వందేమాతరం' నినాదం చేస్తాను. 'వందేమాతరం'. ఈ నినాదం చేసుకుంటూ సాహసవంతుడైన ఆ బాలుడు తరగతి నుండి బయటకు వెళ్ళిపోయాడు.

అతనిని స్కూలు నుండి బహిష్కరించారు. కేశవునిలోని ఈ సంకల్పం అనే అగ్నికణం దావానలంవలె పైకి లేచింది. తనకున్న ఈ దృఢసంకల్ప శక్తి ద్వారానే కేశవుడు తరువాత కాలంలో జాతీయ సౌశీల్య నిర్మాణం చేసే హిందూ సంఘటన ఐన రాష్ట్రీయ స్వయంసేవక్ సంఘ్‌ను స్థాపించాడు.

# ఆజాద్ నిజంగా అజాదే

1921 నాటి సంగతి. ఒకనాడు వారణాసిలోని సందులలో కొందరు బాలుర సమూహం ఆకాశం చిల్లులు పడేలా నినాదం చేసుకుంటూ ముందుకు వెళుతోంది. వారికి నాయకుడు 15 ఏండ్ల బాలుడు. అతనిది బలిష్టమైన శరీరం. ఉచ్ఛస్వరంతో ఆ బాలుడు నినాదము ఇచ్చాడు - 'ఇంక్విలాబ్' వెంటనే 'జిందాబాద్' అనే కేక మారుమ్రోగిపోయింది. 'భారత్ మాతాకీ జై' 'ఆంగ్లేయులారా! భారత్ విడిచిపోండి!' అనే నినాదాలు మిన్నుముట్టాయి.

అప్పుడే, 'పట్టుకోండి, పట్టుకోండి', అనే కేకలు వినవచ్చాయి. బాలురలో కొందరు అటూ ఇటూ పరిగెత్తారు. నాయకత్వం వహిస్తున్న ఆ బాలుడు తన

వెంట వున్న ఇద్దరు ముగ్గురు సహచరులతో అక్కడే స్థిరంగా నిల్చున్నాడు. తీవ్రస్వరంతో నినాదాలు ఇస్తున్నాడు. పోలీసులు వచ్చి అతనిని ఈడ్చుకుంటూ వెళ్ళారు.

అది కోర్టు గది. ఆంగ్లేయ మెజిస్ట్రేటు కఠినస్వరంతో ఇలా అడిగాడు -

'నీ పేరేంటి?' 'ఆజాద్'. ఆ బాలుడు తీక్షణమైన స్వరంతో చెప్పాడు.

'తండ్రి పేరు?' జవాబు వచ్చింది - 'స్వాతంత్ర్యం'.

'ఏమిటి వదరుతున్నావు? మేజిస్ట్రేటు క్రోధంతో అన్నాడు - 'నీవు కోర్టు వారిని అవమానిస్తున్నావు తెలుసునా? నిజం చెప్పు?

నీ ఇల్లెక్కడ?' 'జైలు',

అతను నిర్భయంగా సమాధానం చెప్పాడు.

'మేజిస్ట్రేటు బెత్తాలతో కొట్టమని శిక్ష విధించాడు. బాలుడు అడిగాడు - 'ఇంతేనా?' కోర్టు ముగిసింది.

బెత్తంతో దెబ్బలు కొడుతున్నాడు. చర్మం ఊడివస్తోంది. నెత్తురు కారుతోంది. కాని బాలుడు 'అమ్మా!' అని కూడా అనలేదు. బెత్తపు దెబ్బ పడినప్పుడల్లా 'వందేమాతరం' అనే శబ్దం మాత్రమే అతని నోటి నుండి వెలువడుతోంది. ఆ వీరబాలుడు ఎవరో కాదు. ప్రఖ్యాత విప్లవవీరుడు చంద్రశేఖర ఆజాద్.

చంద్రశేఖర్ నిజంగానే ఆజాద్. అనగా స్వతంత్రుడు. మరణించే క్షణం వరకు పోలీసులు అతనికి సంకెళ్ళు వెయ్యలేకపోయారు.

# కులతత్త్వం పనికిరాదు

నుదుట తిలకం ధరించిన ఒక సేఠ్‌జీ రైల్లో ప్రయాణిస్తున్నాడు. కొంతసేపటికి సేఠ్‌జీ తన భోజనం డబ్బాను తెరిచి భోజనం చేద్దామని అనుకున్నాడు. ప్రక్కనే ఖద్దరు దుస్తులు ధరించిన ఒక నాయకుడు కూర్చుని ఉన్నాడు. సేఠ్‌జీకి అనుమానం వచ్చింది. 'అయ్యా! మీదే కులం? క్షమించండి, కొంచెం ముఖ్యమైన పని ఉండి అడగవలసి వచ్చింది. లేకపోతే.......'

'సాధువుల కులం అడుగవద్దు. జ్ఞానాన్ని గ్రహించండి.' (జాతిన పూఛో సాధుకీ, పూచ్ లీజియే జ్ఞాన్) అనే సామెతను వినలేదా సేఠ్‌జీ?'

'సాధువులు ఐతే కులాన్ని అడగం, మీరు కాషాయవస్త్రాలు ధరించలేదు కదా? ఇప్పుడు పాకీవారు మొదలుకొని బ్రాహ్మణులు, వైశ్యులు అందరు నాయకుల్లాగా కనిపించేందుకు ఖాదీ దుస్తులు ధరిస్తున్నారు. మీ కులం చెప్పటానికి అభ్యంతరం ఏముంది?'

'సేఠ్‌జీ, ఏమీ లేదు.' కులం చెప్పకపోయినా ఏమీ కాదు' ఇలా అని ఆ నాయకుడు పత్రిక చదువుకోసాగాడు. సేఠ్‌జీ ఇంకొకసారి అడిగాడు. అప్పుడు ఆయన ఆలోచించుకుని ఇలా చెప్పాడు. 'ఒక కులమని ఏమి చెప్పేది?' 'అయితే తమరిది వర్ణసంకరమా?' చూడబోతే మీ తండ్రిగారు మరొక కులం స్త్రీని వివాహమాడారు లాగుంది.' తన తండ్రిని గురించిన నిందావాక్యం విన్న ఆ నాయకుడు మర్మగర్భమైన మాటలతో పరిహాసపూర్వకంగా ఇలా చెప్పారు - 'సేఠ్‌జీ, మీరు కులం అడిగారు కనుక వినండి. నేను గాంధీవాదిని. ఉదయమే లేచి ఇల్లు, వాకిలి, పాకీ దొడ్డి శుభ్రం చేస్తాను. అప్పుడు నేను పాకీవాణ్ణి. చెప్పులు శుభ్రపరుచు సమయంలో మాదిగవాడిని. గడ్డం చేసుకొనే సమయంలో

మంగలిని. గుడ్డలు ఉతుకుకొనే సమయంలో చాకలిని. నీళ్ళు తోడేటప్పుడు శూద్రుడను. లెక్కలు చూసుకొనేటప్పుడు వైశ్యుడను. కాలేజీలో బోధించే టప్పుడు బ్రాహ్మణుడను. ఇప్పుడు మీరే చెప్పండి, నా కులం ఏమిటో?'

ఇంతలో స్టేషన్ వచ్చింది. ఆ నాయకునికి స్వాగతం పలికేందుకు స్టేషన్‌లో అపారమైన జనసందోహం ఉంది.

ఆ నాయకుని మెడను పూలహారాలతో ముంచెత్తారు. ఆ నాయకుని పేరు ఆచార్య కృపలానీ. ప్రఖ్యాత గాంధేయవాది.

# ఖుదా వద్దకు పోవాలి.

షా ఆశరామ్ అలీ ఒక భక్తుడు. ఒకసారి ఆయన సహారాన్‌పూర్ నుండి లక్నో వెళుతున్నాడు. రైల్వేస్టేషన్‌లో తన సామాను అంతటిని తూకం వేయించి దానికి తగిన రైల్వే రుసుము చెల్లించవలసిందిగా శిష్యులను కోరారు.

ఆ బండిలో గార్డుగా ఉన్న వ్యక్తి ఆయనకు భక్తుడు. అతను ఇలా చెప్పాడు - 'రుసుము చెల్లించనక్కరలేదు. నేను వెంట వస్తున్నాను కదా.' భక్త షా ఇలా అడిగాడు - 'నీవు ఎక్కడిదాకా వెళుతున్నావు?' గార్డు చెప్పాడు - 'బరేలి వరకు వెళ్తాను. మీరు దిగులు చెందనక్కరలేదు.' 'నాయనా, నేను ఇంకా ముందుకు వెళ్ళాలి' భక్త షా చెప్పాడు. 'బరేలి నుండి లక్నోదాకా ఇంకొక గార్డు వెళతాడు. అతనితో నేను చెబుతాను. మీకు ఏ విధమైన అసౌకర్యము కలుగదు'. 'ఆ తరువాత ఏమౌతుంది?' భక్త షా ప్రశ్నించాడు. 'మీరు లక్నోదాకానే కదా వెళుతున్నారు. అంతవరకు మీకు ఆ గార్డు తోడుంటాడు'. గార్డు సమాధానం చెప్పాడు.

'ప్రియమైనవాడా! నా యాత్ర సుదీర్ఘమైనట్టిది.' భక్తషా చిరునవ్వుతో చెప్పాడు. 'నీవేమో లక్నో దాకా వెళ్ళే సంగతిని గురించి చెబుతున్నావు!'. గార్డు ఆశ్చర్యాన్ని ప్రకటించాడు.

'ప్రస్తుతానికి నేను వెళ్ళవలసింది లక్నో దాకానే. కాని ఈ జీవనయాత్ర ఇంకా సుదీర్ఘమైనది. అది ఖుదావద్దకు చేరటంతో ముగుస్తుంది. సామానంతటికి రుసుము చెల్లించకపోతే ఆ పాపానికి అక్కడ నాకు శిక్ష పడుతుంది. ఆ శిక్ష నుండి నన్నెవరు రక్షిస్తారు?'

గార్డు సిగ్గుతో తలవంచుకున్నాడు. శిష్యులు సామానంతటిని తూకం వేయించి దానికైన రైలుఛార్జి పూర్తిగా చెల్లించారు.

# వికలాంగుడైన నవలా రచయిత

పసితనంలోనే అతని కాలు విరిగిపోయినది. అతనిని చూచిన వారందరూ 'పాపం దురదృష్టవంతుడు' అని అంటుండేవారు. అతని భవిష్యత్ అంధకారమయిపోయిందని బాధపడ్తుండేవారు. అతడి పేరు హెచ్.డి.వెల్స్.

ఎవరేమన్నా అతను లెక్క పెట్టేవాడు కాదు. ఈ పరిస్థితిని ఎదుర్కోనాలి అని అతను అనుకున్నాడు. జీవితంలో ఏదో ఒక ఘనకార్యం సాధించాలని నిశ్చయించుకున్నాడు. సాహిత్య సృష్టి చేయాలని అతడి సంకల్పం. అతను క్రమంగా అభివృద్ధిని సాధించాడు. రచయితగా ప్రపంచ ప్రఖ్యాతిగాంచాడు. అగ్రశ్రేణికి చెందిన నవలారచయితగా పేరుపొందాడు. అతడి కుంటితనం అతని పురోగతిని ఏమాత్రం కుంటుపడనీయలేదు. హెచ్.జి.వెల్స్ తన పురుషార్థం

ద్వారా ఒక విషయాన్ని బుజువుపర్చాడు. అదృష్టం గాని, దురదృష్టం కాని పురుషప్రయత్నం మీదనే ఆధారపడి ఉంటుంది. పురుషార్థం లోపించినపుడు ఆత్మవిశ్వాసం సన్నగిల్లుతుంది. అట్టివారికి అవిటితనం ఒక భారంగా తోస్తుంది. అలాంటపుడు ఆ అవిటి శరీరాన్ని భరించటం కూడా కష్టమయిపోతుంది. కాని వెల్స్ ఎప్పుడూ చిరునవ్వుతోనే జీవించాడు.

# నిత్య సంసిద్ధత

ఒక పర్యాయం అల్మోరాలో దురాక్రమణదారుల నుండి పర్వత ప్రాంతంలో ఉన్న తన రాజ్యాన్ని రక్షించుకునేందుకు అక్కడిరాజు తన సైన్యంలో ఒక క్రొత్త దళాన్ని నిర్మించే ప్రయత్నం చేశాడు. అందుకై అనేకమంది యువకులను భర్తీ చేశారు. ఒక్కొక్కరికి ఒక నూతన ఖడ్గాన్ని ఇచ్చారు. తర్వాత రాజా ఆజ్ఞ ఇచ్చారు - 'ప్రాచల! వెంటనే ఆ యువకులందరూ తన ఒరల నుండి ఖడ్గాలు వెలికిలాగారు. ఆ ఖడ్గాలు త్రిప్పుకుంటూ ఉచ్ఛస్వరంతో కేకలు వేయనారంభించారు. రాజు అడిగాడు - 'ఏమిటి మీరు చేస్తున్న పని?' 'మహారాజా! మేము సదా సన్నద్ధులమై ఉండాలనుకుంటున్నాము. శత్రువు అకస్మాత్తుగా వచ్చి దాడి చేయకుండా ఉండేందుకు ఇలా చేస్తున్నాము.' రాజు ఇలా చెప్పాడు - 'ధైర్యం లేని వాళ్ళు, ఊరకనే ఆవేశపడిపోయే వాళ్ళు, ఇలాంటి వారి వల్ల నాకు ప్రయోజనం లేదు. నిజమైన వీరులు ఇలా ఆర్భాటం చేయరు. యుద్ధానికి నిత్య సంసిద్ధత కల్గి ఉండేందుకు వివిధ రకాలుగా సైనిక శిక్షణ పొందుతారు.'

# భారతీయ ఆత్మ

ఒకప్పటి సంగతి. మహాత్మాగాంధీ, శ్రీ ఠక్కర్ బాప్పా ఒరిస్సాలో ఒక చిన్న రైల్వేస్టేషనులో బండికోసం ఎదురుచూస్తున్నారు. ఒక వృద్ధ ఆదివాసీ వ్యక్తి వచ్చి గాంధీజీ పాదాలను తాకి నమస్కరించాడు.

గాంధీజీ రెప్ప వాల్చక అతనిని చూస్తున్నారు. ఆ వ్యక్తి కేవలం లంగోటీ ధరించాడు. కృశించి వున్నాడు. పక్కటెముకలు కన్పిస్తున్నాయి. మొలలో నుండి అతనొక పైసా పైకి తీసాడు. దానిని మహాత్ముని పాదాల చెంత ఉంచాడు. గాంధీజీ నేత్రాలు మిలమిలలాడాయి. 'ఈ పైసా ఎందుకుంచావు?' అని ఆయన అడిగాడు. 'దైవదర్శనానికి వెళ్ళేటపుడు కానుకలు సమర్పిస్తారు కదా' అని అతనన్నాడు. గాంధీజీకి ఏం చేయాలో తోచలేదు. ఆ పైసాను తీసుకొని ఆయన తన ప్రక్కనే కూర్చున్న ఒరిస్సాకు చెందిన నిస్వార్థ సమాజసేవకుడు గోపబంధు దాస్‌తో ఇలా అన్నారు -- 'చూచారా! ఇదే భారతీయ ఆత్మ అంటే. ఇక్కడ ఈ దేశంలో తిండికి లేని దరిద్రుడు కూడా తన కంటే పేదవారికి సహాయం చేయడం తన ధర్మమని భావిస్తాడు. ఇతని శరీరం చాలా దుర్బలంగా ఉన్నా ఇతని ఆత్మ శక్తిమంతమైనది'.

# జాతీయాభిమానం

1968వ సం.లో శ్రీ నీలం సంజీవరెడ్డి లోక్‌సభకు స్పీకర్‌గా ఉండేవాడు. ఆయన నాయకత్వంలో భారతీయ పార్లమెంటు సభ్యుల ప్రతినిధి సంఘం రష్యాకు వెళ్ళింది. దీనిలో శ్రీ హీరేణ్ ముఖర్జీ (కమ్యూనిస్ట్) (శ్రీ దత్తో పంత్ ఠేంగడీ (జనసంఘ) కూడా ఉన్నారు. తమ పర్యటన సందర్భంగా వారు రష్యాలోని జార్ ప్రభువుల శీతాకాలపు రాజభవనం అయిన పెట్రోగ్రాడ్‌కు

కూడా వెళ్లారు. అక్కడ ఆకర్షణీయమైన గ్రీకు దేవతావిగ్రహాలున్నాయి. వాటిని చూచి శ్రీ ఠేంగడీ అక్కడి రష్యన్‌గైడును అడిగారు - 'ఈ విగ్రహాలన్నీ చాలా పురాతనమైనవిగా కనపడుతున్నాయి. కాని, ఈ రెండు మాత్రం కొత్తవిగా ఉన్నాయి. వీటిని తర్వాత పెట్టారా? ఆగైడ్ చెప్పాడు - 'అవును, ఈ విగ్రహాలు కొత్తవే. వీటిని రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత ఇక్కడ పెట్టారు. శ్రీ ఠేంగడీ అడిగారు - 'ఎందువల్ల? రష్యా ఒక కమ్యూనిస్ట్ రాజ్యం. నాస్తిక దేశం. ఇక్కడ విగ్రహారాధన పనికిరాదు. మతం, దేవుడు కూడా ఇక్కడ నిషిద్ధమే. అటువంటప్పుడు ఈ విగ్రహాలు ఇక్కడ ఎందుకు పెట్టినట్లు?' దీనిపై ఆ రష్యన్ గైడ్ ఇలా చెప్పాడు - 'రష్యావారు విగ్రహారాధకులు కావటం వల్లనో, లేదా వారికి గ్రీకు దేవతల పట్ల భక్తి ఉండటం వల్లనో ఈ విగ్రహాలను ఇక్కడ పెట్టలేదు. ఇది వారి జాతీయాభిమానానికి సంబంధించిన విషయం. రెండవ ప్రపంచ యుద్ధంలో జర్మనీ నుండి హిట్లర్ రష్యాపై దాడి చేశాడు. జర్మనీ సైన్యాలు పెట్రోగ్రాడ్ చేరగానే మొట్టమొదటిగా వారు ఈ విగ్రహాలను ధ్వంసం చేశారు. ఈ విగ్రహాలు పగులగొట్టడం వెనుక కారణం ఉంది. వారు రష్యా జాతీయాభిమానంపై దెబ్బ తీయాలని అనుకున్నారు. రష్యన్ల మనఃస్థైర్యాన్ని భంగపర్చాలనుకున్నారు. కాబట్టే యుద్ధానంతరం విరుగగొట్టబడిన ఆ విగ్రహాలకు బదులుగా క్రొత్త విగ్రహాలు చేయించి రష్యన్లు అక్కడ పెట్టారు. ఆ విధంగా తమ ఆత్మగౌరవాన్ని కాపాడుకున్నారు. రష్యన్లు హిట్లర్‌ను ఓడించారు. అంతేగాదు, హిట్లర్ తమ జాతికి చేసిన అవమానాన్ని కూడా తుడిచివేసుకున్నారు. ధ్వంసం చేయబడిన విగ్రహాలకు బదులుగా ఈ క్రొత్త విగ్రహాలను ఏర్పాటుచేయడం ద్వారా రష్యా జాతీయ స్వాభిమానాన్ని పునరుజ్జీవింప చేసుకున్నారు. తమకు జరిగిన అవమానానికి ప్రతీకారం తీర్చుకున్నారు.'

# మతిదాసుని ధర్మనిష్ఠ

ఔరంగజేబు అడిగాడు - 'మతిదాసు అంటే ఎవరు?' భాయీ మతిదాస్ వెంటనే ముందుకు వచ్చి చెప్పాడు - 'నేనే మతిదాస్‌ను. గురూజీ ఆజ్ఞాపిస్తే ఇక్కడ కూర్చుని ఉండి ఢిల్లీ, లాహోర్ నగరాలలో జరిగే సంగతులన్నీ వివరంగా చెప్పగలము. నీ కోటను ధ్వంసం చేయగలను.' ఔరంగజేబు కోపంతో అరిచాడు. భాయీ మతిదాస్‌ను మతం మార్చుకోమన్నాడు. లేకపోతే అనేకరకాలుగా హింసించగలమని భయపెట్టాడు. సలసల మరుగుతున్న వేడినూనె గంగాళాలను చూపించి అతన్ని భయపెట్టడానికి ప్రయత్నం చేశాడు. కాని ధర్మవీరులు తమ ప్రాణాలను లెక్కచేయరు. ధర్మం కోసం వారు తమ జీవితాలను త్యాగం చేయటమే ఉత్తమమని భావిస్తారు.

ఔరంగజేబు చేసిన ప్రయత్నాలన్నీ వ్యర్థమయినాయి. అతని బెదిరింపులు ఏవీ పనిచెయ్యలేదు. ఆయనకు కోపం వచ్చింది. ఔరంగజేబు కాజీను పిలిపించి అడిగాడు - 'ఇతనికి ఏమి శిక్ష విధించాలి. చెప్పు'. కాజీ, ఖురాన్ పేజీలు త్రిప్పి తన తీర్పు ఇలా చెప్పాడు. 'ఇస్లాం మతం స్వీకరించని నేరానికి ఈ కాఫిర్‌ను రంపంతో కొయ్యనుచీల్చే మాదిరిగా నిలువున రెండుగా చీల్చాలి.' ఔరంగజేబు సైనికులను పిలిచి కాజీ ఆజ్ఞలను అమలుపరచవలసిందిగా ఆదేశించాడు.

ఢిల్లీలోని చాందినీచౌక్‌లో రెండు స్థంభాలు పాతారు. వాటి నడుమ భాయీ మతిదాస్‌ను త్రాళ్ళతో గట్టిగా బిగించి కట్టారు. అంతట సైనికులు ఒక రంపంతో పై నుండి క్రిందికి అతనిని చీల్చడం మొదలుపెట్టారు. మతిదాసు 'అయ్యో' అని కూడ అనలేదు. అయిదు నిముషాల అనంతరం ఔరంగజేబు మళ్ళీ చెప్పాడు - 'ఇప్పటికీ మించిపోలేదు. నీవు ఇస్లాం మతం స్వీకరించు. నిన్ను

విడిచిపెడతాం. నీకు ఎంతో డబ్బు, ఎన్నో బహుమతులు ఇస్తాం'. వీర మతిదాసు నిర్భయంగా చెప్పాడు. --- 'నా గొంతులో ప్రాణాలుండగా నా మతాన్ని ఒదులుకోను'. మతిదాసు అంతటి ధర్మవీరుడు. అతన్ని రంపంతో చీల్చిన చౌక్‌ను భాయీ మతిదాస్ చౌక్ అని ఇప్పటికీ పిలుస్తారు.

# దయ్యాలతో యుద్ధం చేస్తా

బిలే అని స్వామి వివేకానందున్ని ఇంట్లో చిన్నప్పుడు పిలుస్తుండేవారు. బిలే మహా తుంటరి బాలుడు. మొండితనం చేస్తుండేవాడు. అతనికి భయం అనేది లేదు. గర్వం కూడ తక్కువ లేదు. చదువుకునేటప్పుడు మనస్సు లగ్నం చేసి ఏకాగ్రతతో చదువుకునేవాడు. ఆడుకునేటప్పుడు స్నేహితులతో కలిసి రకరకాల ఆటలు ఆడుకునేవాడు. చెట్ల పైకి ఎక్కటం, బంతి ఆట ఆడటం, వ్యాయామం చేయటం అతనికి మిక్కిలి ప్రీతికరమైన విషయాలు. కోతుల మాదిరిగా చెట్ల పైకి ఎక్కటం అతనికి ఎంతో ఆనందంగా ఉండేది. అతని తాతగారికి మనుమడు చెట్లపైకి ఎక్కి అల్లరి చేసే అలవాటు ఇష్టం ఉండేది కాదు. ఆయనకి భయంగా ఉండేది. బిలే అల్లరి మాన్పటానికి ఆయన భయపెట్టాడు - 'చెట్టు మీద దయ్యాలున్నాయి. అవి నిన్ను ఎప్పుడో పట్టుకుంటాయి. అప్పుడు ఏమి చేస్తావు?'

బిలే మీద ఈ మాటలు ఏమీ పనిచెయ్యలేదు. కాసేపు అయిన తరువాత అతడు మళ్ళీ చెట్టుపైకి ఎక్కాడు. కోతి మాదిరిగా ఎగిరి అల్లరి చెయ్యటం మొదలుపెట్టాడు. స్నేహితుడు ఒకడు అతనికి గుర్తు చేశాడు - 'తాతగారు నీకు ఏమి చెప్పారు? చెట్టు మీద భూతాలు ఉన్నాయి. అయినా నీవు చెట్టు ఎక్కటం మానవేమి?' బిలే నవ్వి ఇలా జవాబు చెప్పాడు - 'దయ్యం ఉంటే ఇంతకు

ముందు కనిపించలేదు ఎందువల్ల? ఇలాంటి కబుర్లకు నేను భయపడేవాణ్ణి కాను. ఒకవేళ ఆ దయ్యం కనిపించినా కూడ దాన్ని మనం అంతా కొట్టి, పారిపోయేట్లు చెయ్యలేమా?' ఈ విధంగా ప్రారంభం నుండి వివేకానందుడు నిర్భయుడుగా, సాహసవంతుడుగా ఉండేవాడు.

# వివేకానందుడి హనుమద్భక్తి

అయిదు యేండ్లు రాగానే నరేంద్రునికి చదివించేందుకు ఒక ఉపాధ్యాయుడిని నియమించారు. నరేంద్రుడిని ఇంట్లో బిలే అని పిలుస్తుండేవారు. నరేంద్రుడిది చంచల స్వభావం. అందువల్ల ఒకనాడు ఉపాధ్యాయుడు అతనిని కొట్టాడు. నరేంద్రుడు నోటి వెంట తటాలున ఈ మాటలు వెలువడ్డాయి - 'నేను మహావీర హనుమాన్ భక్తుడను. మీరు నన్ను దండిస్తే నేను వినను. ప్రేమతో బుజ్జగించి చెపితే మీ మాట వింటాను'. ఉపాధ్యాయునికి ఈ చిన్న బాలుని మాటలు విని మతిపోయింది. ఆనాటి నుండి బాలుడికి ప్రేమతో చదువు చెప్పటం మొదలుపెట్టాడు.

# ఆత్మవిశ్వాస ఫలం

స్వామి రామతీర్థ అమెరికా భూమి మీద అడుగుపెట్టాడు. ప్రయాణంలోనే అతని జేబులు ఖాళీ అయినాయి. ఆ దేశం ఆయనకు పూర్తిగా కొత్త. అక్కడ ఆయనకు సహాయం చేసేందుకు తెలిసిన వ్యక్తి ఒక్కడు కూడ లేడు. ఓడలో ఆయనకు ఒక వ్యక్తితో మంచి సంబంధం ఏర్పడింది. ఆ వ్యక్తి స్వామీజీతో జ్ఞానం గురించి, ధ్యానం గురించి చర్చలు జరుపుతూ ఉండేవాడు. ఓడ దిగేటప్పుడు ఆ వ్యక్తి మర్యాద కోసం అడిగాడు - 'మీరు ఎక్కడ ఆగుతారు? దయచేసి మీ అడ

స్సు ఇవ్వండి. నేను వచ్చి మిమ్మల్ని కలుస్తూ ఉంటాను.'

స్వామీజీ అతని భుజంపై చేయి వేసి ఇలా చెప్పాడు. - 'అమెరికాలో నాకు ఒకే ఒక మిత్రుడు ఉన్నాడు. ఆ మిత్రుడు - మీరే.' ఆ వ్యక్తి స్తంభించిపోయాడు. ఆయన వైపు అలాగే చూస్తూ ఉండిపోయాడు. స్వామీజీ ఆత్మవిశ్వాసం, సౌజన్యం అతనిని ఎంతగానో ప్రభావితం చేశాయి. అతని హృదయంలో ఒక స్పందన కలిగింది. తాము ఇరువురు అనేక యేండ్లుగా పరిచితులు అయినట్లు, పరమమిత్రులు అయినట్లు తోచింది. అతడు స్వామిజీ చెయ్యి పుచ్చుకున్నాడు. తనతోపాటు తీసుకునివెళ్లాడు. తన ఇంట్లో ఉంచుకున్నాడు. స్వామీజీ అమెరికాలో ఉన్నంతకాలము వారి అవసరాలన్నింటిని అతనే పూర్తి చేశాడు. ఆత్మవిశ్వాస ఫలం ఇది.

# మాతృభూమి పిలుపు

లాహోరులోని ఒక కాలేజీలో స్వామీ వివేకానంద విద్యార్థుల ముందు ప్రసంగించాడు. వారి ఉపన్యాసం చాలా స్ఫూర్తిని ఇచ్చేదిగా ఉంది. గణితశాస్త్రాచార్యుడు అయిన తీర్థరాం ఒక యువకుడు. స్వామీజీ ఉపన్యాసం వల్ల అతను ఎంతగానే ప్రభావితుమయ్యాడు.

స్వామీజీని వారి అనుయాయులతో సహా తీర్థరాం తన ఇంటికి భోజనానికి ఆహ్వానించాడు. ఇంటి వద్ద అనేక విషయాలపై చర్చ జరిగింది. సూక్ష్మపరిశీలకుడైన స్వామీజీ కళ్ళకు తీర్థరాంలోని గొప్పదనం కనిపించింది. ప్రొఫెసర్ తీర్థరాం ఆ సంభాషణల వల్ల తన్మయుడైపోయాడు. అతని ప్రార్థన మేరకు స్వామీ వివేకానంద ఒక గీతాన్ని గానం చేశారు.

'రాముడున్న చోట కాముడు లేడు
కాముడున్న చోట రాముడు లేడు.
తులసి చెప్పినట్టి సత్యము వినుము.
రవియు, శశియు కలిసి ఉండుట ఎట్లు?'
(జహాఁ రామ్ తహా కామ్ నహి
జహాఁ కామ్ నహి రామ్.
తులసీ కబహు కి రహి సకహి
రవి రజనీ ఇక ఠామ్)

పాట అక్కడి శ్రోతలందరి హృతంత్రులను మీటింది. ఆ గానంతో మైమరచిపోయిన రామతీర్థ ఊహా లోకంలో విహరింపసాగాడు. ఆయన తనలో తాను ప్రశ్నించుకోసాగాడు - 'ఆ జగత్ ప్రభువు నాకు ఈ మానవశరీరాన్ని ప్రసాదించింది. కేవలం కుటుంబ పోషణ చేసుకోవటానికేనా?' స్వామీజీ వెళ్ళే సమయం అయింది. తీర్థరాంకు ధ్యానముద్ర భంగం అయింది. వీడ్కోలు సమయంలో స్వామీజీకి కానుకగా ఏమి ఇవ్వాలి? దారిద్ర్య దేవత ఒడిలో పెరుగుతున్న ఆ ప్రొఫెసర్ దగ్గర ఒక బంగారపు గడియారం ఉంది. అదే ఆయన వద్ద ఉన్న అత్యంత విలువైన సంపద. నిండు హృదయంతో రామతీర్థ ఇలా అన్నాడు - 'స్వామీజీ, ఈ నిరుపేద భక్తుని చిరుకానుకను స్వీకరించండి.' ఇలా అని ఆ బంగారపు గడియారాన్ని వారి ముందు ఉంచాడు.

బంగారాన్ని స్పృశించని స్వామీజీ ఆ గడియారాన్ని స్వీకరించాడు. రామతీర్థ స్వామీజీ చరణాలపై శిరస్సు ఉంచాడు. కాని ఇది ఏమిటి? స్వామీజీ ఇలా చెప్పాడు - ఇప్పుడు ఈ గడియారం నాది. దీనిని నేను ఇక్కడే మీవద్ద సురక్షితంగా ఉంచుకుంటాను. చెప్పండి. దీనిని జాగ్రత్తగా కాపాడగలరా?'

'దానికేమి?' ప్రొఫెసర్ తీర్థరాం విశ్వాసంతో జవాబు చెప్పాడు. 'తీర్థా! విను నీ జన్మ కామినీ కాంచనముల కొరకు ఏర్పడి ఉండలేదు. మాతృభూమి పిలుపు నీకు వినిపించటం లేదా? నీవు అనేక మహత్కార్యములు చేయవలసి ఉంది.' స్వామీజీ చెప్పుకుంటూ పోతున్నారు. తీర్థరాం మౌనంగా వింటూ నిలుచున్నాడు.

ఆనాటి భారతమాతృ ధర్మదూత భావి ధర్మదూత రామతీర్థకు దీక్షామంత్రాన్ని ప్రసాదించాడు. ఇప్పుడు ఆయన స్వామి రామతీర్థ అయినాడు.

## కలిసి జీవించండి - పంచుకుని భుజించండి.

ఒక శిష్యుడు వున్నాడు. అతడు తన గురువుని అడిగాడు. 'గురూజీ! ప్రపంచంలో జీవించవలసిన పద్ధతి ఏమిటి?'

గురువు చెప్పాడు - 'మంచి ప్రశ్న వేశావు. ఒకటి రెండు రోజులలో జవాబు చెపుతాను'. మర్నాడు గురూజీ దగ్గరకు ఒక వ్యక్తి కొన్ని పండ్లు, మిఠాయిలు తీసుకొనివచ్చాడు. ఆ వ్యక్తి పదార్థాలన్నీ గురువు ముందర పెట్టాడు. ప్రణామం చేసాడు. ఆయన ప్రక్కన కూర్చున్నాడు. గురువు ఆ వ్యక్తితో మాట్లాడను కూడా మాట్లాడలేదు. అటువైపు తిరిగి కూర్చున్నాడు. పండ్లు మిఠాయిలు అన్నీ తినేశాడు. ఆ వ్యక్తి తనలో ఇలా అనుకున్నాడు - 'ఈ గురువుగారు విచిత్రంగా ఉన్నారు. తెచ్చినవన్నీ తినేశారు. అన్నీ తెచ్చింది నేనే. నా వైపు చూడనైనా చూడలేదు.'

చివరికి కోపంతో లేచి ఏదో సణుగుకుంటూ వెళ్లాడు. అతను వెళ్ళిన తర్వాత గురువు శిష్యుడిని అడిగాడు - 'ఏమంటున్నాడా వ్యక్తి?' శిష్యుడు ఇలా చెప్పాడు - 'గురూజీ! అతడు చాలా క్రోధంలో ఉన్నాడు. 'నేను తెచ్చిన

పదార్థాలన్నీ తిన్నారు. నన్ను పలకరించనయినా పలకరించలేదు.' అన్నాడు. గురువు చెప్పారు - 'అయితే విను. ప్రపంచంలో జీవించే పద్ధతి ఇది కాదు. ఇంకేదైనా పద్ధతి ఆలోచించాలి.'

కొంచెం సేపు అయిన తర్వాత ఇంకొక వ్యక్తి వచ్చాడు. అతడు కూడా పండ్లు, మిఠాయిలు తీసుకొని వచ్చాడు. పండ్లు, మిఠాయిలు గురువు ముందర పెట్టి అతడు కూర్చున్నాడు. గురువు పండ్లు, మిఠాయిలు తీసి బజారులోకి విసిరివేశాడు. అయితే ఆ వ్యక్తితో ఎంతో ప్రేమగా, గౌరవంగా మాట్లాడుతూ అడిగాడు - 'చెప్పండి, ఏమిటి సమాచారం? కుటుంబంలో అంతా బాగున్నారా? మీ పనులు బాగా సాగుతున్నాయా? పిల్లలంతా క్షేమంగా ఉన్నారా? బాగా చదువుకుంటున్నారా? వారిని బాగా చదివించండి. మీకు ఆరోగ్యం బాగున్నది కదా. మనశ్శాంతి లభిస్తున్నదా? దేవుణ్ణి పూజిస్తున్నారా? శరీరం ఆరోగ్యంగా ఉండి, మనస్సు ప్రసన్నంగా ఉండి, భగవత్పూజలో మనస్సు లగ్నమైతే ఇంకా కావలసినది ఏముంది?' గురువు ఈ విధంగా తియ్యగా మాట్లాడుతున్నారు. ఆ వ్యక్తి మనసులోనే కోపంతో ఇలా అనుకుంటున్నారు - 'గురువుగారు విచిత్రంగా ఉన్నారు. నాతో మాటలు మాత్రం తియ్యగా చెబుతున్నారు. కాని, నేను తెచ్చిన కానుకలను అవమానం చేశారు. ఏదో విషం కలిపినట్లుగా వాటిని విసరి పారవేశారు.'

అతను కూడా ఏదో సణుగుకుంటూ వెళ్లిపోయాడు. గురువు శిష్యుణ్ణి అడిగాడు - 'ఇతను సంతోషంగా వెళ్లాడా?' శిష్యుడు చెప్పాడు - 'లేదు గురూజీ! ఇతను మొదటివ్యక్తి కంటే కూడా ఎక్కువ క్రోధంతో ఉన్నాడు. ఇలా అనుకుంటూ వెళ్తున్నాడు - 'నేను తెచ్చిన కానుకలను ఈయన అవమానించాడు.' గురువు ఇలా చెప్పాడు. 'అయితే విను. ప్రపంచంలో జీవించే పద్ధతి ఇది కూడా కాదు. ఇంకేదైనా మార్గాన్ని ఆలోచించవలసి వుంది.'

అప్పుడు ఇంకొక వ్యక్తి అక్కడికి వచ్చాడు. అతను కూడా మిఠాయిలు తెచ్చాడు. గురువు ఎదుట వుంచి కూర్చున్నాడు. గురువు అతనితో ఎంతో ప్రేమగా మాట్లాడాడు. పదార్థాలన్నింటినీ అక్కడే కూర్చున్న భక్తులందరికీ పంచిపెట్టాడు. కొంత మిఠాయి ఆ వ్యక్తికి కూడా ఇచ్చాడు. కొంత తాను తిన్నాడు. అతన్ని కుటుంబాన్ని గురించి, అతని పరిస్థితుల గురించి అడిగి తెలుసుకున్నాడు. అతనికి మంచి కథలు వినిపించాడు. బోధలు చేశాడు. ఆతను వెళ్లిన తరువాత గురువు అడిగాడు - 'ఈ వ్యక్తి ఏం చెబుతున్నాడు?' శిష్యుడు ఇలా చెప్పాడు - 'ఇతడు ఎంతో సంతోషంగా ఉన్నాడు గురూజీ! మిమ్మల్ని ఎంతగానో ప్రశంసిస్తున్నాడు. ఇలా చెబుతున్నాడు - 'ఇలాంటి గురువును కలిసినందుకు మనసు ఎంతో ప్రసన్నంగా ఉన్నది'.

గురువు ఇట్లా చెప్పాడు - 'అయితే విను. ప్రపంచంలో జీవించవలసిన పద్ధతి ఇదే. గుర్తుంచుకో. ప్రభువు నీకిచ్చిన దాన్ని అందరికీ పంచి నీవు తిను. త్యాగ భావనతో అనుభవించు. దీంతోపాటుగా భగవంతుని పైన భక్తి కలిగి ఉండు. నామ సంకీర్తనం చేయి. భగవంతుణ్ణి ధ్యానించు. నీ వద్దకు వచ్చిన వ్యక్తులతో తియ్యగా, హితకరంగా మాట్లాడు.

# అస్పృశ్యత ఒక శాపం

ఆనాడు శివరాత్రి. ఆనాటి అర్ధరాత్రి సమయంలో ఒక సభ జరిగింది. దానికి నారాయణ గురు అధ్యక్షత వహించారు. వక్తలు చాలామంది నారాయణ గురు ఆదర్శాలను గురించి వివరించారు. జనసముదాయము అంతా తన్మయులై వింటున్నారు.

ఆ మహాసభకు కొంచెం దూరంలో కొందరు వ్యక్తులు వేరుగా కూర్చొని

ఉన్నారు. వారు అస్పృశ్యులుగా పిలువబడుతున్నవారు. ఆ రోజులలో ప్రజలలో ఒక దురభిప్రాయం ఉండేది. అస్పృశ్యులది నీచమైన కులం అని భావించేవారు. వారిని కలుసుకున్న మాత్రం చేత మనుషులు అపవిత్రమైపోతారని భావించేవారు. నారాయణ గురు దృష్టి అటు వెళ్లింది. ఆయన ఉపన్యాసం చెప్పే వ్యక్తిని కొంచెం సేపు ఆగవలసిందని కోరారు. వాతావరణం అంతా స్తబ్ధమైపోయింది. వేరుగా కూర్చున్న వ్యక్తులలో నుండి ఇరువురు బాలురను వేదిక వద్దకు రావలసినదిగా నారాయణ గురు సైగ చేసి పిల్చారు. వారు అక్కడికి వెళ్ళారు. వారిని ఎంతో ప్రేమతో పలకరించి నారాయణగురు తమ వద్ద కూర్చుండబెట్టుకున్నారు. కొంతసేపు వారు స్నేహార్ద్ర భావంతో ఆ బాలురను నిమురుతూ ఉన్నారు. మరల వారు ఇలా చెప్పనారంభించారు - 'ఇతర మానవులకు వలెనే ఈ బాలురు కూడా ఆ పరమేశ్వర సంతానమే. మనమంతా పరమేశ్వరుని సంతానం. అస్పృశ్యత కంటే మించిన పాపం మరొకటి లేదు.' ఆయన నేత్రాలు అశ్రుపూరితమైపోయాయి. సభలో ఉపన్యాసం మరల మొదలైంది. వేరుగా కూర్చున్న ఆ సోదరులు కూడా అందరితోపాటు వచ్చి కలిసి కూర్చున్నారు. నారాయణ గురు ఇలా చెప్పేవారు - 'పరమేశ్వరారాధన కేవలం దేవాలయాలలో జరుగదు. ప్రతి ఇంట్లో, ప్రతి హృదయంలో ఆయన ఉన్నాడని గ్రహించాలి.'

ఈ ఆదర్శానికి అనుగుణంగానే ఆయన జీవితమంతా వ్యవహరించారు. అస్పృశ్యతా నివారణ ఆయన జీవిత కార్యం. సుప్రసిద్ధ కవి రవీంద్రనాథ్ టాగూర్, మహాత్మాగాంధీ వంటి మహాపురుషులు ఆయన ఆశ్రమానికి వెళ్ళి వారిని సందర్శించారు.

# తప్పుడు సాక్ష్యం చెప్పలేదు.

బెంగాల్‌లో దివంగత నాయకుడు డాక్టర్ విధాన చంద్రరాయ్ కలకత్తా మెడికల్ కాలేజీలో విద్యార్థిగా ఉన్నరోజులు. అతని ఇంగ్లీషు ప్రొఫెసర్ పేరు పైక్. ఒకరోజు ఆ ప్రొఫెసర్ తన గుఱ్ఱపు బండిలో బజారుకు వ్యాహ్యాళికి బయలుదేరాడు. అతని బండి ఒక ట్రామ్‌తో ఢీకొంది. విధాన చంద్రరాయ్ దీనికి ప్రత్యక్ష సాక్షి. గుఱ్ఱపుబండి నడిపేవానిపై కేసు పెట్టాడు. ప్రొఫెసర్ రాయ్‌ను బండివాని తరపున తప్పుడు సాక్ష్యం చెప్పమని కోరాడు. కాని రాయ్ అందుకు అంగీకరించలేదు. పరీక్షలలో ప్యాసు చెయ్యను అని ప్రొఫెసర్ అతనిని బెదిరించాడు. విధాన చంద్ర ఈ బెదిరింపులకు లొంగలేదు. మౌఖిక పరీక్షలో ప్రొఫెసర్ తన పగ తీర్చుకున్నాడు. తెలివిగల విద్యార్థి అయిన రాయ్‌ని తప్పినట్లు ప్రకటించాడు. రాయ్ దీనిని ఏ మాత్రం లక్ష్యపెట్టలేదు. పట్టుదలతో మళ్లా రెండవసారి పరీక్షకు కూర్చున్నాడు. విధాన చంద్రరాయ్ యొక్క ధృడసంకల్పం, సత్య ప్రియత్వం ప్రొఫెసర్ మనస్సును మార్చివేశాయి. ఆయనకు చాలారోజులు మనశ్శాంతి లేకుండాపోయింది. చివరకు ఆ ప్రొఫెసర్ విధాన చంద్రరాయ్‌ను క్షమించమని కోరాడు. జీవితాంతం ఆ తర్వాత రాయ్‌ను ప్రశంసిస్తుండేవాడు.

# భారతీయ లాఠీని రుచి చూడు

'ఈ సభ కర్నల్ వైలీని తుపాకీతో కాల్చి చంపిన మదన్‌లాల్ ఢీంగ్రా పట్ల ఏకగ్రీవంగా తన నిరసనను వ్యక్తం చేస్తున్నది.'

'లేదు, ఏకగ్రీవంగా కాదు. నేను, వినాయక దామోదర సావర్కార్ ఈ తీర్మానాన్ని వ్యతిరేకిస్తున్నాను.' సగం ప్రపంచం మీద ఆధిపత్యం చెలాయిస్తున్న

ఆంగ్లేయుల రాజధాని అయిన లండన్ నగరంలో ఒక బానిస దేశానికి చెందిన యువకుడు చేసిన సాహసమిది! పామర్ అనే పేరు గల ఒక ఆంగ్లో-ఇండియన్ దీనిని సహించలేకపోయాడు. అతడు సావర్కార్ ముక్కుపై తన పిడికిలితో ఒక గుద్దు గుద్ది ఇలా చెప్పాడు - 'ఇదిగో, ఆంగ్ల పిడికిలిని రుచి చూడు.' సావర్కార్ ముక్కు నుండి నెత్తురు కారసాగింది. అదే సమయంలో ఒక భారతీయ నవయువకుడు త్రిసమలాచార్య అక్కడికి లంఘించి, పామర్ తలపై తన లాఠీతో కొట్టి, ఇలా చెప్పాడు - 'ఇదిగో ఒక భారతీయ లాఠీని రుచి చూడు.' అప్పుడే సభలో ఎవరో టపాకాయలు పేల్చారు. సభ అంతా గందరగోళమయిపోయింది. జనం చెల్లాచెదరైపోయారు. లండన్‌లో మదన్‌లాల్ ఢీంగ్రా పై నిరసన తెలిపే తీర్మానం ఆమోదింపబడలేదు.

# జీవకారుణ్యం

నెత్తురు ముద్ద అయిన ఒక కుక్కను భుజం మీద మోసుకుంటూ ఒక వ్యక్తి నగరం వైపు వేగంగా అడుగులు వేస్తూ పోతున్నాడు. త్రోవలో మోటార్లు, ట్రక్కులు అనేక వాహనాలను ఆపేందుకు ప్రయత్నించాడు. కాని ఎవరూ అతనికి సహాయపడలేదు. నగరం అక్కడి నుండి ఇరవై రెండు మైళ్ల దూరాన ఉంది. మాటలో మాధుర్యం, హృదయంలో కారుణ్యం కలిసి ఉన్న ఆ యువకుడు హుంకరిస్తూ ముందుకు ముందుకు సాగిపోయాడు. నగరంలోకి ప్రవేశించిన తర్వాతనే అతడు స్వేచ్ఛగా ఊపిరి పీల్చుకున్నాడు. పశువుల ఆస్పత్రిలో కుక్కకు చికిత్స జరిగింది. ఆ జీవి మాట్లాడలేదు, కాని అశ్రుపూరిత నయనాలతో తన కృతజ్ఞతను ప్రకటించింది.

ఆ నవ యువకుడు ఎవరో తెలుసునా? ప్రజలు ఆయనను ఉక్కు మనిషి

అని పిలుస్తారు. కాని ఆయన హృదయంలో జీవకోటి పట్ల అపార కరుణాభావం గంగాధారలుగా ప్రవహిస్తుండేది. ఆయన పేరు సర్దార్ వల్లభాయ్ పటేల్. ఆయన మనదేశానికి ప్రథమ గృహమంత్రిగా ఉన్నారు.

# గౌరవం ఎవరికి

మద్రాస్ హైకోర్టులో న్యాయమూర్తి స్వర్గీయ సర్ అశుతోష్ ముఖర్జీ. ఆయన మహా విద్వాంసుడు. వాతావరణం మార్పు కోసం ఆయన మధుపూర్ వెళ్లారు. ఆ సమయంలో ఆయన హైకోర్టులో తాత్కాలిక ప్రధాన న్యాయమూర్తి. మధుపూర్ నుండి తిరిగి వచ్చేటప్పుడు వారు బెంగాలీ మిత్రులతో కలిసి ప్లాట్‌ఫారం మీద అటూ ఇటూ తిరుగుతున్నారు. ఇంతలో మధుపూర్‌కి చెందిన యూరోపియన్ సబ్ డివిజినల్ మేజిస్ట్రేట్ వచ్చాడు. అతడు వెయిటింగ్ రూమ్ నుండి ఒక వాలుకుర్చీ తెప్పించుకున్నాడు. ప్లాట్‌ఫారం మీద వేయించుకొని దానిపై కాళ్లు బారజాపుకొని పడుకొని పొడుగాటి చుట్ట ఒకటి త్రాగసాగాడు.

సర్ అశుతోష్ సీదాసాదా స్వభావం కల మనిషి. ఆయన ఎప్పుడూ సాధారణమైన దుస్తులు అనగా చొక్కా - ధవతి ధరిస్తుండేవారు. పచారులు చేస్తూ ఆయన చాలా పర్యాయాలు ఆ యూరోపియన్ మేజిస్ట్రేట్ ముందు నుండి వెళ్లారు. కాని అతడు అదే ప్రకారం నిర్లక్ష్యంగా పడుకొని చుట్ట త్రాగుతూనే ఉన్నాడు.

అర్ధగంట తరువాత సర్ అశుతోష్ నౌకరు ఆయన సామాన్లు తీసుకొని వచ్చాడు. నౌకరు ధరించిన ఎర్రదుస్తులు చూచి మేజిస్ట్రేట్ కుతూహలంతో అతనిని అడిగాడు - 'ఈ సామాను ఎవరిది?' సామాను కలకత్తా హైకోర్టు ఛీఫ్

జస్టిస్‌కు సంబంధించినది అని అతనికి తెలిసింది. పచార్లు చేస్తున్నది ఛీఫ్ జస్టిస్ అని కూడా తెలిసింది. తక్షణమే తన చుట్ట అవతల పారవేసి లేచి నిల్చుని అతడు సర్ అశుతోష్‌కు సవినయంగా సలామ్ చేశాడు.

ముఖర్జీ తన సహచరులతో ఇలా చెప్పాడు - 'మీకు తెలుసా, ఈయన ఎవరికి సలామ్ చేస్తున్నాడో?' ఇది నాకు ఇస్తున్న గౌరవం కాదు, నా నౌకరుకి ఇస్తున్న గౌరవం.' మేజిస్ట్రేట్ సిగ్గుతో తలవంచుకొని నిలుచున్నాడు.

# మనిషికి విలువ ప్రతిభ వల్ల

జార్జ్ బెర్నార్డ్‌షాను ఒకనాడు ఒక మహిళ రాత్రిపూట విందు భోజనానికి ఆహ్వానించింది. పనిలో వ్యస్తమై ఉన్నప్పటికీ ఆయన ఆ ఆహ్వానాన్ని స్వీకరించాడు.

విందు రోజున షా తీరిక లేని పనిలో వున్నాడు. పని పూర్తికాగానే ఆయన శీఘ్రమే ఆ మహిళ ఇంటికి వెళ్లాడు. ఆయనను చూడటంతోటే ఆ మహిళ కన్నులు సంతోషంతో మెరిశాయి. కాని మరుక్షణమే ఆమె ముఖం విచారగ్రస్తమైపోయింది. దానికి కారణం ఉంది. షా అత్యంత సాధారణమైన దుస్తులు ధరించి ఉన్నాడు. కారణం అడుగగా షా చెప్పాడు ఆలస్యం కావటం వల్ల ఆయనకు దుస్తులు మార్చుకోవటానికి సమయం లేకపోయింది. కాని ఆ మహిళ అంగీకరించలేదు. ఆమె చెప్పింది - 'మీరు మోటారుబండిలో కూర్చొని ఇంటికి వెళ్లండి మంచి దుస్తులు వేసుకొని రండి.' 'మంచిది, అలాగే. నేను ఇప్పుడే వచ్చేస్తాను,' అని చెప్పి షా ఇంటికి వెళ్లాడు. తిరిగి వచ్చేటప్పుడు అత్యంత విలువైన దుస్తులు ధరించి వచ్చాడు.

విందు భోజనం మొదలైంది. కొంతసేపటికి అందరూ వింతగా చూచారు.

షా ఐస్‌క్రీమ్ తదితర భోజన పదార్థాలు తన గుడ్డలకు పూస్తున్నాడు. ఆయన ఇలా అంటున్నాడు - 'తినండి, నా దుస్తుల్లారా, తినండి. ఆహ్వానం లభించింది మీకే. మీరే తినండి.'

'ఏమిటి మీరు చేస్తున్న పని?' అందరూ అడిగారు. షా చెప్పారు - 'మిత్రులారా, నేను చేయవలసిందే చేస్తున్నాను. ఇక్కడికి ఆహ్వానించింది నన్ను కాదు, నా దుస్తులను. ఇందువల్ల ఈ రోజు భోజనం నా దుస్తులే స్వీకరించాలి.

ఆయన ఇలా చెప్పటంతోటే పార్టీలో నిశ్శబ్దం తాండవించింది. ఆహ్వానించిన మహిళ సిగ్గుతో కుంచించుకొనిపోయింది. ఆమెకిప్పుడు అర్థమయింది. వ్యక్తికి విలువ అతని ప్రతిభ వల్ల లభిస్తుంది కాని అతడు ధరించిన దుస్తుల వల్ల కాదు.

# దృఢ సంకల్పం కావాలి

కదియవాడ్‌లో రవిశంకర మహారాజ్ అక్కడి జమీందారీ కార్మికుల చేత ప్రతిజ్ఞ చేయించాడు. 'మేము ఇక నుండి త్రాగుడు మానివేస్తాము.' అని వారు ప్రతిజ్ఞ చేశారు. అందులో ఒక ఠాకూర్ ఇలా చెప్పాడు - 'మహారాజ్, నేను త్రాగుడు మానివేస్తాని ప్రతిజ్ఞ చేస్తాను. కాని సారాయి నన్ను పట్టుకొని పీడిస్తున్నది.' మహారాజ్ ఇలా చెప్పాడు - 'నాకు ఇప్పుడు పనుంది. రేపు వస్తే మాట్లాడుదాం.'

మరునాడు ఉదయమే ఆ ఠాకూర్ కేక వేసి పిల్చాడు. మహారాజ్ ఇలా చెప్పాడు - 'నేను ఎలా వచ్చేది? ఈ స్తంభం నన్ను పట్టుకొంది. ఆ కూలీ లోనికి వెళ్ళి చూచాడు. మహారాజ్ రెండు చేతులూ స్తంభం చుట్టూ ఉన్నాయి. అతను ఇలా అన్నాడు - 'మహారాజ్‌జీ, మీరు చేతులు అక్కడ నుంచి తీయండి'. 'అరే.

ఠాకూర్, ఎలా తీసేది? ఇది నన్ను వదిలిపెడితే కదా!' ఠాకూర్‌కు ఏమీ అర్థం కాలేదు.

కొంతసేపు అయిన తరువాత మహారాజ్ స్తంభాన్ని వదలివచ్చారు. ఇలా చెప్పారు - 'ఠాకూర్, స్తంభాన్ని నేను పట్టుకున్నానా, స్తంభం నన్ను పట్టుకున్నదా.' 'స్తంభాన్ని మీరే పట్టుకున్నారు. స్తంభం మిమ్మల్ని ఎలా పట్టుకుంటుంది?' 'అయితే సారాయిని నీవు వదలిపెట్టడం లేదా, సారాయి నిన్ను వదలిపెట్టడం లేదా?' ఆ ఠాకూర్ ఆ క్షణంలోనే సారాయిని వదలిపెట్టేందుకు సంకల్పం చేసుకున్నాడు.

# హిందీ భాషాభిమాని

కాంగ్రెస్ మాజీ అధ్యక్షులు డా. పట్టాభి సీతారామయ్యకు గట్టి పట్టుదల ఉండేది. దేశ సర్వతోముఖాభివృద్ధికీ వికాసానికీ దైనందిన జీవితంలో హిందీలోనే ఉత్తరప్రత్యుత్తరాలు జరుపుకోవాలని ఆయన భావించేవారు. తాను వ్రాసే లేఖలన్నీ హిందీలోనే వ్రాసేవారు. దక్షిణ భారత పోస్టల్ అధికారులకు వారి ఉత్తరాలు బట్వాడా చేయడం అసౌకర్యంగా ఉండేది. అడ్రసు ఇంగ్లీషులో వ్రాయమని వారు కోరారు.

శ్రీ సీతారామయ్య ఇలా జవాబు చెప్పారు 'హిందీ భారత్‌కు జాతీయభాష. అందుచేత నేను హిందీలోనే వ్రాస్తాను.'

పోస్టల్ విభాగ అధికారుల నుండి బెదరింపు ధోరణిలో ఒక లేఖ వచ్చింది. వారు తమ పట్టుదల వదలకపోతే, వుత్తరాలన్నీ 'డెడ్ లెటరు ఆఫీసుకు' పంపవలసి వస్తుందని చెప్పారు.

వచనబుద్ధుడు, దేశభక్తుడు అయిన డా. సీతారామయ్యపై ఈ బెదరింపులు పనిచేస్తాయా? వారు అంగీకరించనే లేదు. చివరకు పోస్టలు అధికారులు మచిలీపట్నం పోస్టాఫీసులో హిందీ తెలిసిన ఒక ఉద్యోగిని నియమించారు. శ్రద్ధ, పట్టుదల ఉండాలేగాని అట్టి వ్యక్తుల ముందు ప్రభుత్వ విభాగాలు కూడా లొంగి వస్తాయి. వ్యతిరేకత కూడా తొలగిపోతుంది. జాతీయ భాషాభివృద్ధి కోసం, రండి, మనం కూడా డా. పట్టాభి సీతారామయ్యను అనుసరిద్దాం.

# వయం పంచాధికం శతం

ఆరోజుల్లో పాండవులు అరణ్య వాసంలో వున్నారు. ఎవరో శత్రువు వచ్చి దుర్యోధనుణ్ణి యుద్ధంలో ఓడించి, బంధించి తీసుకొని వెడుతున్నట్లుగా యుధిష్ఠిరునికి సమాచారం తెలిసింది. ఆయన మహాబలశాలి అయిన భీమసేనుడితో ఇలా అన్నాడు - 'సోదరా, వెళ్లి నీ సోదరుడయిన దుర్యోధనుణ్ణి విడిపించుకొని తీసికొని రా!'

భీముడిలా చెప్పాడు - 'ఆ దుష్టుని కారణంగానే మనం ఇలా వీధివీధిలా బిచ్చమెత్తుకొనే స్థితికి వచ్చాము. నిండుసభలో ద్రౌపదిని అవమానించిన నీచుడు వాడు. అట్టి వానిని విడిపించుకొని రమ్మని నన్ను ఆదేశిస్తున్నారా? ఈ పని నేను చేయనే చేయను.'

యుధిష్ఠిరుని వయనాలు దయార్ద్రములయినాయి. యుధిష్ఠిరుని కండ్లలో నీరు తిరుగగానే అర్జునుడు చూడలేకపోయాడు. గాండీవాన్ని తీసుకొని వెంటనే బయలుదేరి వెళ్లాడు. దుర్యోధనుని శత్రువులను ఓడించాడు. దుర్యోధనుని విడిపించాడు. చేతులు కట్టుకొని వచ్చి దుర్యోధనుణ్ణి యుధిష్ఠిరుని ముందు నిలబెట్టాడు.

ధర్మరాజు ఇలా చెప్పాడు - 'సోదరా, మనలో పరస్పరం అభిప్రాయభేదం వుండవచ్చు. వైరం ఉండవచ్చు. కాని బయటినుండి శత్రువులు ఎవరైనా వచ్చి మన వంశం మీద దాడి చేస్తే అప్పుడు వందమంది కౌరవులు మీరు ఐదుగురు పాండవులము మేము. అందరమూ కలిసి నూట ఐదుగురం అవుతాము. మనలో ఎవరికి అవమానం జరిగినా అది మన వంశానికి జరిగిన అవమానంగా భావించాలి.

# రాణాప్రతాప్ గొప్పతనం

భామాషా సహాయంతో రాణాప్రతాప్ మరలా సైన్యాన్ని సమకూర్చుకున్నాడు. మొగలులను చిత్తుగా ఓడించాడు. డూంగర్‌పూర్, బాంస్‌వాడా, మొదలయిన స్థానాలను కైవశం చేసుకుంటూ పోతున్నాడు. ఆ రోజుల్లో జరిగిన సంఘటన ఇది.

ఒకనాడు రాణాప్రతాప్ అస్వస్థుడుగా ఉన్నాడు. బాగా జ్వరం వచ్చింది. రాజకుమారుడైన అమరసింహుడు యుద్ధానికి నేతృత్వం వహిస్తున్నాడు. అబ్దుర్రహీమ్ ఖాన్ ఖానా సైన్యంతో అతని సైన్యం ఢీ కొన్నది. ఖాన్‌ఖానా సైన్యం ప్రాణాలు అరచేతుల్లో పెట్టుకొని పారిపోయింది. అమరసింహుడు మహిళలను మిగిలిఉన్న సైనికులనూ బంధించాడు. ఈ సమాచారం రాణాప్రతాప్‌కు తెలిసింది. ఆయన క్రుద్ధుడైపోయాడు. ఇలా చెప్పాడు - 'రాజపుత్రుడెవ్వరైనా స్త్రీలపై చేయి చేసుకుంటే నేను సహింపజాలను. ఇది మనకు అవమానంతో క్రుంగిపోవలసిన విషయం.' అంతటి తీవ్ర జ్వరంలోనూ రాణాప్రతాప్ ఖాన్‌ఖానా కుటుంబానికి చెందిన మహిళలు బంధింపబడిన చోటికి చేరుకున్నాడు.

రాణాప్రతాప్ ఖాన్‌ఖానా బేగంతో వినమ్రస్వరంతో ఇలా చెప్పాడు - 'ఖాన్‌ఖానా నాకు అన్నగారు అవుతారు. అందువలన మీరు నాకు వదినెగారి వరుస. నా యీ శిరస్సు ఇంతవరకు ఎవరి ముందు వంగలేదు. కాని నా కుమారుడైన అమరసింహుడు మిమ్మల్ని బంధించాడు. అతడు ఇలా చేసిన కారణంగా మీకెంతో కష్టం కలిగింది. అందుకు నేను క్షమాపణ చెప్పుకుంటున్నాను. మిమ్మల్ని అందరినీ సగౌరవంగా మొగలు సేనాశిబిరంలోకి పంపే ఏర్పాటు చేయగలను, నేను మాట యిస్తున్నాను.'

అక్కడ హతాశుడై నిరాశతో ఖాన్‌ఖానా అక్బరు వద్దకు వెళ్లాడు. అక్బరు వ్యంగ్యోక్తులతో అతనికి ఇలా స్వాగతం పలికాడు - 'మీ జనానాను యుద్ధభూమిలో వదలివేసి మీరు మీ ప్రాణాలు కాపాడుకొని ఇక్కడికి క్షేమంగా చేరుకున్నారు కదా!' ఖాన్‌ఖానా తలవంచుకొని ఇలా చెప్పాడు - 'జహాపనాహ్! మీరు నన్ను సిగ్గుపడేలా మాటలు అనండి. కాని ఒక మాట మాత్రం చెప్పగలను. రాణాప్రతాప్ ఉండగా అక్కడ మహిళలకు ఎట్టి ప్రమాదమూ లేదు.' ఈలోగా ఖాన్‌ఖానా కుటుంబానికి చెందిన మహిళలు అందరూ క్షేమంగా అక్కడికి చేరుకున్నారు.

ఈ దృశ్యాన్ని చూసిన అక్బరు గంభీరవదనుడై ఖాన్‌ఖానాతో ఇలా అన్నాడు - 'రాణాప్రతాప్ మీకొక్కరికే కాదు, మొగలు వంశం అంతటికీ గౌరవాన్ని చేకూర్చాడు. రాణాప్రతాప్ ఔన్నత్యం ముందు నా శిరస్సు వంగిపోతోంది. రాణాప్రతాప్ వంటి ఔదార్యం గల యుద్ధవీరుని ఎవ్వరూ బానిసగా చేయలేరు.'

# రాయికీ రత్నానికీ తేడా లేదు

కబీరు కుమారుడు కమాల్. అతడు నిజమైన విరాగి. అతని దృష్టిలో రాయికీ రత్నానికీ తేడా లేదు.

ఒకనాడు కాశీరాజు అతనిని కలుసుకొనేందుకు అతని కుటీరానికే వచ్చాడు. ప్రణామం చేసి కమాల్ పాదాల ముందు అత్యంత విలువైన రత్నం ఒకటి ఉంచాడు. కమాల్ ఇలా చెప్పాడు - 'తెచ్చిన వాళ్ళు ఒక రాయి తెచ్చారా?' 'కమాల్ నిజంగా అద్భుతమైన భక్తుడిలాగే వున్నాడు. రత్నాన్ని రాయిగా భావిస్తున్నాడు! ఇది ధగధగా మెరుస్తున్నా ఈయన మనస్సు చలించలేదు.' అని రాజుకు అనిపించింది. రాజు వినమ్రుడై ఇలా నివేదించాడు - 'స్వామీ! ఇది రత్నం. రాయి కాదు' 'రత్నమే అనుకోవయ్యా. నీవు తెచ్చావు కదా. సరే! కుటీరంలో ఆ మూల దాన్ని వుంచు'. రాజుకు సందేహం కలిగింది. 'కమాల్ నటన చేస్తున్నట్లుగా వుంది. ఈయన మాటలకూ చేతలకూ తేడా కనిపిస్తోంది.' ఏమయితేనేమి, రాజు పరీక్షించి చూద్దామనుకున్నాడు. ఆ రత్నాన్ని కుటీరంలో ఒక మూల పెట్టాడు. అక్కడి నుండి వెళ్లిపోయాడు.

కొన్ని మాసాల తరువాత రాజు మరల కమాల్‌ను కలుసుకొనేందుకు వచ్చాడు. సంభాషణల నడుమ తాను కొన్ని మాసాల క్రింద ఇచ్చిన కానుకను గురించి గుర్తు చేశాడు. కమాల్ ఇలా అన్నాడు - 'చాలామంది ఇక్కడికి వస్తుంటారు. కానుకలు యిస్తుంటారు. అవన్నీ నాకు వ్యర్థంగా తోస్తాయి. వ్యర్థమయిన వస్తువుల గుర్తు నాకేమి ఉంటుంది?'

రాజు వెంటనే ఇలా అన్నాడు - 'స్వామీ! నేనిచ్చిన కానుక సామాన్యమయినది కాదు. చాలా విలువ గల రత్నం, ఇప్పుడు ఎక్కడ ఉంది

అది?' కమాల్ చెప్పాడు - 'దానిని నేను ముట్టుకోనూ లేదు, చూడనూ లేదు. మీరు ఎక్కడ పెట్టారో అక్కడే చూడండి.'

రాజు తాను రత్నం పెట్టిన చోటుకు వెళ్లి వెతికాడు. రత్నం అక్కడే వుంది. కమాల్ దాని వైపు చూచినట్లు కూడా లేదు. భక్తకమాల్ వైరాగ్యభావం ముందు రాజు నతమస్తకుడైనాడు. ఆయన పరీక్షించాలన్న భావం కలిగినందుకు పశ్చాత్తాపంతో తిరిగివెళ్లాడు.

# ఆత్మదర్శనం

బ్రహ్మదేశాన్ని పరిపాలిస్తున్న రాజు మహాప్రతాపవంతుడు. ఆయన ఒక పర్యాయం నైమిశారణ్యంలో ఉపవిష్టులై ఉన్న పదివేల మంది ఋషులను ఇలా ప్రార్థించాడు - 'ఋషులారా, ఇక్కడ సమావేశంలో మీరందరూ విద్వద్వరేణ్యులు. ఆత్మదర్శనాభిలాషినై నేను మీ ముందుకు వచ్చి ప్రార్థిస్తున్నాను. దయతో నాకు నిగూఢమైన ఆత్మతత్వాన్ని గురించి వివరించండి.'

ఋషిమండలి అంతటా నిశ్శబ్దం ఆవరించింది. రాజు నిరాశతో అక్కడి నుంచి తిరిగివెళ్లాడు. త్రోవలో అష్టావక్రుడు కూర్చుని వుండగా ఆ రాజు చూశాడు. ఆ ఋషి రాజుతో ఇలా అన్నాడు - 'మహారాజా! మీరు చూస్తునే వున్నారు. నేను శారీరకంగా అసమర్థుణ్ణి. బాగా అలసిపోయి వున్నాను. ముందుకు కదలలేకుండా వున్నాను. ఈరోజు ఇక్కడే విశ్రాంతి తీసుకుంటాను. దయ ఉంచి మీరు మరో మార్గాన వెళ్లండి.' రాజు క్రోధాగ్నితో మండిపోయాడు. 'అధముడా! నీకింతటి దుస్సాహసమా? త్రోవలోనుండి తొలగిపో. నేను ఇక్కడ నుండి వైదొలగను...' అష్టావక్రుడు సౌమ్యంగా

నిశ్చలమయిన స్వరంతో మరల చెప్పాడు - 'రాజా! ప్రక్కనే మరొకదారి ఉంది. ఆ మార్గంలో గుండా మీరు ఎందుకు వెళ్లకూడదు?' రాజు క్రోధాతిరేకంతో ఇలా చెప్పాడు - 'లేదు. నేను ఈ త్రోవలోనే వెడతాను.'

'మహారాజా! మొండి పట్టుదల మూర్ఖుల లక్షణం. పైగా ఈ త్రోవలోనే వెళ్లటం వలన మీకు ఒరిగేది యేమీ లేదు. దానికోసం పట్టుబట్టడం అజ్ఞానమే అవుతుంది.' రాజుకు విభ్రాంతి కలిగింది. 'వికలాంగుడా, నీ వుద్దేశ్యం యేమిటి?' అని అన్నాడు.

'నేను చెప్పదల్చుకున్నది ఒకటే - కండ్లు మూసుకొని వెళ్లేవాడికి ఎవరూ త్రోవ చూపలేరు. ఋషులు, మునులు కూడా ఏమీ సహాయపడలేరు. ఆత్మదర్శనం సంగతి చెప్పేదేముంది?'

ఈ మాట వినడంతోనే రాజుకు జ్ఞానోదయం అయింది. రథం నుండి క్రిందికి దిగి వచ్చి అష్టావక్ర మునిచరణములకు ప్రణమిల్లాడు.

ఆ ఋషి చెప్పాడు - 'రాజన్, ఆత్మదర్శనమంటే ఇదే. జీవుడికి ప్రతిక్షణమూ ఆత్మదర్శనమవుతూనే ఉంటుంది. కాని ఆశ్చర్యకరమయిన విషయం ఏమిటంటే - కండ్లకు కనిపించేదే అయినా అది ఆత్మకు అందదు. జ్ఞాననేత్రం వికసించినపుడే ఆత్మదర్శనమవుతుంది.'

# సత్యమేవ జయతే

రాజు సత్యవ్రతుడికి ఒక నియమం ఉండేది. బజార్లో వస్తువులు అమ్ముతుంటారు. అమ్మగా ఏవయినా వస్తువులు మిగిలితే అవి అన్నీ సాయంకాలానికి ఆయన కొనివేస్తాడు. ఒకనాడు ఒక కమ్మరి ఇనుముతో చేసిన శని విగ్రహాన్ని బజారుకు తెచ్చి ఇలాచెబుతున్నాడు - 'ఈ విగ్రహాన్ని కొన్నవారిని

లక్ష్మి, ధర్మం, కర్మ, యశస్సు, శక్తి మొదలయినవన్నీ వదలిపెట్టిపోతాయి.' ఈ మాటలు విన్నవారెవయినా దానిని కొంటారా? నియమానుసారం రాజు దానిని కొనుగోలు చేశాడు.

అర్ధరాత్రివేళ రాజుగారి గదిలో ఏదో మెఱుసినట్లయింది. ఒక అందమయిన స్త్రీ ప్రత్యక్షమై రాజుతో ఇలా చెప్పింది - 'ఇప్పుడు నీ గృహంలో శని వచ్చి కాపురమున్నాడు. నేను రాజ్యలక్ష్మిని. ఇక్కడ ఉండలేను. నాకు శలవు ఇవ్వు రాజా!'

రాజ్యలక్ష్మి వెళ్లిపోయింది. ఒకరి తరువాత ఒకరు ధర్మం, కర్మ, యశస్సు, బలం అన్నీ వదలి వెళ్లిపోయాయి. ఇప్పుడు సత్యం వంతు వచ్చింది. సత్యము కూడా వెళ్లబోతుంటే మహారాజు చేయి పట్టుకొని ఇలా అన్నాడు - 'మిగిలినవన్నీ పోతే పోనచ్చుగాక. నేను నిన్ను మాత్రం వెళ్లనీయను. నేను సత్యవ్రతాన్ని అవలంబించుకొని ఉన్నాను. సత్యాన్ని ఆచరణలో పెట్టాను. నీ సాక్షాత్కారము కోసమే నేను శని విగ్రహాన్ని కొన్నాను. సత్యదేవా, కరుణించు, దయచేసి నా గృహంలో నివసించు.'

సత్యదేవుడు దీనికి ఎదురు సమాధానం చెప్పలేకపోయాడు. సత్యదేవుడు పోకుండా ఆగిపోయేసరికి మిగిలినవన్నీ తిరిగి వచ్చాయి. 'సత్యమేవ జయతే, నానృతమ్' - సత్యమే జయిస్తుంది, అబద్ధం కాదు.

# భగవంతునికి ఎవరు ప్రియులు

ఒకసారి అబూబిన్ ఆడన్ గాఢంగా నిద్రపోతున్నాడు. అతనికి ఒక కల వచ్చింది. దేవదూత ఒకడు బంగారు పుటలు గల ఒక పుస్తకంలో ఏదో వ్రాస్తున్నాడు.

ఆబూ అడిగాడు - 'మీరు వ్రాస్తున్నదేమిటి?' దేవదూత ఇలా చెప్పాడు -

'భగవంతునికి అత్యంత ప్రీతిపాత్రులయిన వ్యక్తుల జాబితా వ్రాస్తున్నాను.' ఇందులో నాపేరు ఉన్నదా?' ఇలా ఆబూ అడిగేసరికి దేవదూత తల అడ్డంగా త్రిప్పి, 'లేదు' అని చెప్పాడు. ఆబూ ఇలా ప్రార్థించాడు - 'భగవంతుడిని ప్రేమించలేకపోయినా, భగవద్భక్తులను ప్రేమించే వ్యక్తులు కొందరు ఉంటారు. అట్టి వ్యక్తుల జాబితా ఎప్పుడయినా మీరు వ్రాయబూనుకుంటే, దయ చేసి అందులో నా పేరు కూడా చేర్చండి.' దేవదూత అదృశ్యమయిపోయినాడు. మర్నాడు రాత్రికి మళ్లీ కల వచ్చింది. అదే దేవదూత. అదే బంగారు పేజీల పుస్తకం. కండ్లు మిరుమిట్లు గొలిపే ఆ వెలుగుకు ఆబూ మేల్కొన్నాడు. దేవదూతను చూసి ఆబూ అడిగాడు - 'మహాత్మా, మీరు చదువుతున్నదేమిటి?' దేవదూత జవాబు చెప్పాడు - 'భగవంతుడికి ఎక్కువ ప్రీతిపాత్రులయిన వ్యక్తుల పేర్లు చదువుతున్నాను. ఆబూ నిన్ను అభినందిస్తున్నాను. నీ పేరు జాబితాలో మొట్టమొదట వ్రాయబడి ఉంది.' ఇలా చెప్పి దేవదూత అదృశ్యమైపోయాడు.

అందువలన మానవ సేవయే నిజమైన భగవత్పూజ.'

# బాలుని స్వావలంబనం

స్వామి సత్యదేవ పరివ్రాజకులు విదేశ పర్యటన ముగించుకొనివచ్చి తమ అనుభవాలు చెబుతున్నారు. వారు చెప్పిన ఒక విషయం ఇది:-

'ఒకనాడు సియాటల్ (అమెరికా)లో వార్తాపత్రిక అమ్ముతున్న ఆరేండ్ల బాలుడు ఒకడు నా వద్దకు వచ్చి అడిగాడు - 'మీరు పత్రిక కొనుక్కుంటారా?' 'వద్దు. నాకు పత్రిక అక్కరలేదు.' అని సమాధానం చెప్పాను.

'ఒక సెంటు మాత్రమే. ఎక్కువ కాదు.' అని ఆ బాలుడు

కరుణార్ద్రస్వరంతో అన్నాడు. నేనొక సెంటు అతనికి ఇచ్చి, 'నీ తల్లిదండ్రులు నిరుపేదలా?' అని అడిగాను.

అతడు ఎంతో ఆశ్చర్యపోతూ నావైపు చూసి 'ఎందుకు?' అని అడిగాడు. 'నీవు వార్తాపత్రికలు అమ్ముతున్నావు కనుక,' అని నేను జవాబు చెప్పాను. 'క్షమించండి. నా తల్లిదండ్రులు బాగా సంపన్నులే. కాని వారి సంపదపై ఆధారపడి నేను వృద్ధుడను కాదల్చుకోలేదు.' ఇలా చెప్పి ఆ బాలుడు మరొక వ్యక్తి దగ్గరకు వెళ్లిపోయాడు-

ఆ బాలుని స్వావలంబ భావనకు స్వామిజీ ఎంతగానో మెచ్చుకొన్నారు.

# ప్రేమ్‌చంద్ నవ్వుమొగం

మున్షీ ప్రేమ్‌చంద్ ఎప్పుడూ నవ్వుముఖంతో ఉండేవాడు. ఉత్సాహంగా ఉండేవాడు. అంతేకాదు. ఆయన నవ్వు చుట్టూ వ్యాపించేది. ఆయన సంపర్కంలోకి వచ్చిన వ్యక్తిమొగం మాడ్చుకొని వుండేవాడు కాదు. ఒకసారి జరిగిన విషయం, ప్రయాగ విశ్వవిద్యాలయ సాహిత్య పరిషత్ తరఫున ఒక కార్యక్రమానికి అధ్యక్షత వహించవలసిందిగా వారిని ఆహ్వానించారు. అక్కడికి ప్రవేశించగానే ఆయన అంతటా నవ్వుల పువ్వులను విరజిమ్మసాగారు. అందరూ పకపక నవ్వుతున్నారు. అక్కడ ఒక విద్యార్థి అడిగాడు - 'మీకున్న అత్యంత ప్రియమయిన కోరిక ఏమిటి?' నవ్వుల మధ్య ప్రేమ్‌చంద్ ఇలా చెప్పాడు - 'నాకున్న పెద్దకోరిక ఒకటే. భగవంతుడు నన్ను నిష్ప్రయోజకుల నుండి కాపాడాలని కోరుకుంటున్నాను. అప్రయోజకత్వం అంటే నాకు ఊపిరాడదు -

ప్రేమ్‌చంద్ ఎప్పుడు తలచుకుంటే అప్పుడు వ్రాయగలరు. ఆయనకు బాహ్య సాధనాలు ఏవీ అక్కర్లేదు. మాటల మధ్య ఒకవ్యక్తి ఆయనను అడిగాడు

- 'మున్షీజీ, మీరు ఎలాంటి కాగితం మీద వ్రాస్తారు? ఎలాంటి 'పెన్'తో వ్రాస్తారు?' ప్రేమచంద్ పెద్దగా నవ్వుతూ ఇలా జవాబు చెప్పాడు - 'జనాబ్, అంతకు ముందు ఏమీ వ్రాయని కాగితం మీద వ్రాస్తాను.' మరల కొంచెం గంభీరంగా - 'ఈ ఆడంబరాలన్నీ నాలాంటి వ్రాత పనివాళ్లకు కాదు.'

# గృహాలంకరణ

మహారాజా రణజిత్ సింహుని వద్దకు ఒకసారి ఒక వ్యాపారి అత్యంత సుందరమైన పూల గాజు కూజా అమ్మటానికి తెచ్చాడు. మహారాజా దానిని తీసికొని అవతల విసిరి పారవేశాడు. అది ముక్కలు ముక్కలయిపోయింది. అంతట ఆ వ్యాపారితో ఇలా అన్నాడు - ' ముక్కలను బజార్లో అమ్ముకొనిరా!'

సభికులందరూ ఆశ్చర్యచకితులైపోయారు. కాసేపటికి వ్యాపారి వట్టి చేతులతో వచ్చాడు. మహారాజా ప్రక్కనే ఉన్న అరలో నుండి ఇత్తడి సిరాబుడ్డి వ్యాపారి చేతికిచ్చి, దానిని పగులకొట్టి బజారులో అమ్ముకొని రమ్మని చెప్పాడు.

కొంతసేపటికి వ్యాపారి బజారు నుంచి వచ్చాడు. పగిలిపోయిన సిరాబుడ్డి అమ్మితే రెండుపైసలు వచ్చాయని తెచ్చాడు. మహారాజా అందరినీ సంబోధిస్తూ ఇలా చెప్పాడు -చూడండి. నాదేశం ధనికదేశం కాదు. కేవలం అలంకరణ కోసం ఇలాంటి ఖరీదయిన వస్తువులను మనం ఉపయోగించుకోలేము. ఇవి పగిలిపోతే ఎందుకూ పనికిరావు. చెత్తకుప్పలో పారవేయవలసిందే. ఇత్తడి వస్తువులు పగిలిపోయినా సగం ధరకు అమ్ముడుపోతాయి.' అక్కడున్న వారందరూ రణజిత్ సింహుని మాటలు విని ఆయనను ప్రశంసించకుండా ఉండలేకపోయారు.

# నిర్భయుడైన తత్త్వవేత్త

ఒక పర్యాయం తైమూర్‌లంగ్ చాలామంది బానిసలను తీసుకొని వచ్చాడు. బంధింపబడిన ఆ బానిసలందరినీ అమ్మేందుకు తానే స్వయంగా ధర చెప్పేవాడు. బేరం కుదిరితే అమ్మివేస్తుండేవాడు. ఆ బానిసలందు తుర్కిస్థాన్‌కు చెందిన ఒక తత్త్వవేత్త ఉన్నాడు. అతని పేరు అహమదీ. తైమూర్ అతనిని అడిగాడు - 'ఈ ప్రక్కన నిల్చున్న ఇరువురు బానిసల విలువ ఎంత ఉంటుంది? చెప్పండి.' అహమదీ ఇలా చెప్పాడు - 'వీరు తెలివి గల వారిలాగా కనిపిస్తున్నారు. వీరి విలువ నాలుగువేల అశర్ఫీలకు తక్కువ ఉండదు.' తైమూర్ లంగ్ అడిగాడు - 'అయితే నేను ఎంత విలువ చేస్తానో చెప్పండి.'

కాసేపు ఆలోచించి, అహమదీ చెప్పాడు - '20 అశర్ఫీలు.'

తైమూర్ కోపంతో కంపించిపోయాడు. 'ఇది నాకు అవమానం. నా శాలువ చేస్తుంది ఈ ఖరీదు.' అహమదీ కోపంతో జేవురించిన తైమూర్ ముఖం వంక చూస్తూ ఇలా చెప్పాడు - 'ఈ విలువను నేను నీవు కప్పుకున్న శాలువను బట్టే చెప్పాను. నీలాంటి అత్యాచారి యొక్క విలువ ఒక అశర్ఫీ కూడా వుండదు.'

ఇంత నిర్భయంగా చెప్పిన సమాధానం విన్న తరువాత తైమూర్‌లంగ్ కోపం శాంతించింది. సత్యాన్ని నిర్భయంగా చెప్పిన ఆ పరాక్రమశాలి. సాహసి అయిన తత్త్వవేత్తను ఆయన విడుదల చేశాడు.

# స్వర్గనరకాలు

వాంగ్‌లీ అనే యుద్ధవీరుడు కన్‌ఫ్యూషియస్ వద్దకు వెళ్లి ఇలా అడిగాడు - 'స్వామీ, నాకు స్వర్గం అంటే ఏమిటో నరకం అంటే ఏమిటో సెలవీయండి. వాటి నడుమ వున్న తేడా వివరించండి.' కన్‌ఫ్యూషియస్ చిరునవ్వు నవ్వుతూ ఇలా చెప్పాడు - నీవు యుద్ధవీరుడవనుకుంటున్నావు. కాని నిజానికి కాదు.

చూస్తే ఒక బిచ్చగాడిలాగా కనిపిస్తున్నావు.'

ఇది విని వాంగ్ లీ క్రుద్ధుడైపోయాడు. క్రోధావేశంతో ఒర నుండి ఖడ్గాన్ని సర్రున లాగాడు. ఇది చూచి ఆ తత్త్వవేత్త పకపక పెద్దగా నవ్వసాగాడు. ఖడ్గం వైపు చూపిస్తూ, 'ఈ కత్తి చూసుకొని నీవేదో మహాగర్వంగా ఉన్నావు. అది నకిలీ ఖడ్గం, నిజమైనది కాదు. నమ్మకం లేకపోతే నా కంఠాన్ని కోసి చూపించు.'

వాంగ్‌లీ ఆలోచనలో పడిపోయాడు. ఆ తత్త్వవేత్త మాటలలో ఏదో అంతరార్థం వుంటుందని తోచింది. అతను శాంతించాడు. శిరస్సు వంచాడు. కత్తిని ఒరలోకి నెట్టాడు.

కన్‌ఫ్యూషియస్ చెప్పాడు - 'చూచావా, నీవు క్రోధాగ్నితో జ్వలిస్తూ ఖడ్గాన్ని చూపిస్తున్నప్పుడు అది నరకం. నీవుశాంతించి, స్తిమితం పొందినపుడు స్వర్గం. స్వర్గనరకాలు నడుమ వుండే తేడా నీ మనఃస్థితి, నీ ప్రవర్తన పైన ఆధారపడి ఉంటుంది.

# నియమపాలన

ఒకసారి డాక్టర్జీ తమ మిత్రులతో కలిసి అడేగావ్ వెళ్లారు. అక్కడ ఆయన మిత్రులొకరున్నారు. వారింట్లో మిత్రుని కుమారునికి ఉపనయనం జరుగుతోంది. ఆనాడు శనివారం. భోజనాదికాలు పూర్తి అయ్యేసరికి ఆలస్యమయింది. నాగపూర్ తిరిగి వెళ్లేందుకు ఒక బస్సు వుంది కాని, అది దాటిపోయింది.

ప్రతి ఆదివారం నాగపూర్‌లోని స్వయంసేవకులందరికీ ఏకత్రీకరణ వుంటుంది. సమత కార్యక్రమం ఉంటుంది. అందులో ప్రతి స్వయంసేవక్ నియమంగా పాల్గొనాలి. అక్కడ డాక్టర్జీకి అడేగావ్‌లో సాయంకాలం

అయిపోయింది. నాగపూర్ చేరేందుకు వేరే వాహనం ఏదీ లేదు. డాక్టర్జీ అక్కడి నుండి నాగపూర్‌కు నడిచి వెళ్లాలని నిశ్చయం చేసుకున్నారు. ఆయనతోపాటు నలుగురు స్వయంసేవకులు కూఢా ఉన్నారు.

'ఇక్కడి నుండి నాగపూర్ చాలా దూరం వుంది. మొత్తం 32 మైళ్ల దూరం.' అని ఎవరో చెప్పారు. డాక్టర్ హెడ్గేవార్ ఇలా చెప్పారు - 'మేము రాత్రి అంతా నడుస్తూనే వెడతాం. ఉదయానికి నిర్ణీత సమయంలోపల సంఘస్థాన్‌కు హాజరవుతాము.'

మిత్రుడు ఆయన బంధువులూ ఎంతగానో చెప్పిచూశారు. డాక్టర్జీ ఎవరు చెప్పినా వినలేదు. వారు అక్కడి నుంచి కాలినడకన బయలుదేరారు. దృఢనిశ్చయంతో ప్రయత్నశీలురైన వారికి భగవంతుడు కూడా తప్పక సహాయం చేస్తాడు - వారు 8 -10 మైళ్ళు నడిచారు. ఇంతలో నాగపూర్ వెళ్లే బస్సు ఒకటి వారి వద్దకు వచ్చి ఆగింది - డ్రయివర్ డాక్టర్జీని గుర్తుపట్టాడు. అందువల్ల మోటారు ఆపి, అడిగాడు - 'డాక్టర్ సాబ్, ఇంత రాత్రి వేళ కాలినడకన ఇదేమిటి?'

డాక్టర్జీ నవ్వుతూ చెప్పారు - 'భాయీ, నాగపూర్ పోవటం అవసరం, బస్సు దాటి పోయింది. వేరే వాహనం ఏదీ లేదు. మరేం చేయాలి?'

'అయితే రండి, కూర్చోండి.' డ్రయివర్ వారిని తన ప్రక్కన కూర్చోబెట్టుకున్నాడు. తక్కిన స్వయంసేవకులు వెనుక కూర్చున్నారు. రాత్రి సుమారు ఒంటిగంటన్నరకు వారు అందరూ నాగపూర్‌కు చేరారు. ఉదయమే సరిగ్గా సమయానికి వారు సంఘస్థాన్‌లో ఉపస్థితులయినారు.

# బాలశివాజీ నిర్భయత్వం

తల్లి జీజాబాయి బాలశివాజీకి రామాయణం, మహాభారతం, పురాణాలలోని వీరగాథలు చెబుతుండేది. నారో, శ్రీమల్, హనుమంత్, గోపాజీ - వీరు శివాజీని తీర్చిదిద్దిన అధ్యాపకులు. దాదా కొండదేవ్ సంరక్షకుడు. పిన్నవయస్సులోనే శివాజీ నిర్భయుడయిన వీరునిగా తయారయినాడు. అందుకు ఆయనకు లభించిన శిక్షణయే కారణం.

తన కుమారుడు బీజాపూర్ సుల్తానుల కృపకు పాత్రుడై పైకి రావాలని తండ్రి అయిన శహాజీ కోరిక. ఎనిమిదేండ్ల వయస్సులో శివాజీని తండ్రి దర్బారుకు తీసికొని వచ్చాడు. దర్బారులోకి ప్రవేశించగానే తండ్రి శివాజీకి వీపు నిమిరి నవాబుకు సలాం చేయమని చెప్పాడు. బాలుడు తండ్రి వైపు తిరిగి తీవ్రస్వరంతో ఇలా చెప్పాడు - 'ఈయన మనదేశపు రాజు కాదు. నేనీయనకు శిరస్సు వంచను.' దర్బారులో అంతా నిశ్శబ్దమైపోయింది. నవాబు బాలుడిని ద్వేషంతో చూశాడు. కోపగించుకున్నాడు. శివాజీ నిల్చుని వున్నాడు, నిశ్చలంగా, స్తిమితంగా. శహాజీ జంకుతూనే నవాబును క్షమాపణ కోరాడు. శివాజీ దర్బారు నుండి బయటపడి ఇంటికి వచ్చాడు.

ఇంటికి రాగానే తండ్రి పుత్రుడిని మందలించాడు. శివాజీ జవాబు చెప్పాడు - 'విదేశీ రాజు ముందర తలవంచటం మృత్యువుతో సమానం. తండ్రీ, నేను జీవించి ఉండగా ఈ అవమానాన్ని సహించలేను. ఇక ముందు సహించబోను.' తండ్రికి నోటమాట రాలేదు. శివాజీని చూస్తూ నిల్చుండిపోయాడు. పుత్రుడి భావి జీవితాన్ని గురించి ఆ తండ్రి చింతాక్రాంతుడైనాడు.





# బాలశివాజీ గోరక్షణ

శివాజీ అప్పటికింకా 12 యేండ్ల బాలుడు. ఒకరోజున అతడు బీజాపూర్ రాజమార్గంలో వెడుతున్నాడు. ఒక కసాయివాడు ఒక ఆవును త్రాడుతో బంధించి లాక్కొని వెడుతున్నాడు. శివాజీ ఇది చూశాడు. ఆ గోవు భీతితో ఆతురతతో అటూ ఇటూ చూస్తూ పారిపోవాలని ప్రయత్నిస్తోంది. కసాయివాడు మాటిమాటికి దానిని కర్రతో కొడుతున్నాడు - గోవును మాతగా భావించే హిందువులు అసహాయులై, తలలు వంచుకొని, దుకాణాలలో కూర్చొని, ఈ దుష్కృతాన్ని చూస్తూ నిస్సహాయస్థితిలో ఉన్నారు. బాలశివాజీ ఖడ్గం ఒర నుండి పైకి వచ్చింది. అతడు ముందుకు లంఘించి కసాయి వాని వద్దకు వెళ్లాడు. గోవు మెడకున్న త్రాటిని కోసివేశాడు. ఆవు పారిపోయింది. కసాయి ఏదో చెప్పబోయేలోగా అతని తల తెగి ధడేలున నేలమీద పడింది. వాని దేహం భూమిమీద పడి త్రెళ్లింది. ఈ సమాచారం దావానలం వలె వ్యాపించిపోయింది. దర్బారులో ఫిర్యాదు చేయబడింది. నవాబు క్రోధంతో ఊగిపోయాడు. ప్రమాదంగా పరిణమిస్తున్న తన పుత్రుడిని బీజాపూర్ నుండి బయటకు పంపవలసిందిగా నవాబు శహాజీని ఆదేశించాడు.

శివాజీ బీజాపూర్ వదలిపెట్టాడు. కాని హిందూ సామ్రాజ్య సంస్థాపనను గురించి తన స్వప్నాన్ని మాత్రం వదలిపెట్టలేదు. దానిని తన హృదయంలో భద్రపరుచుకున్నాడు. తుదకు ఆ రోజు కూడా వచ్చింది. బీజాపూర్ సుల్తాన్ శివాజీని తన రాజ్యంలో వున్న స్వతంత్ర హిందూ సమ్రాట్టుగా గుర్తించి ఆహ్వానించాడు. శివాజీ ఏనుగుపై ఊరేగుతూ బీజాపూర్‌లోని రాజమార్గముల గుండా దర్బారులోకి ప్రవేశించాడు. నవాబు ముందుకు వచ్చి ఆయనకు స్వాగతం పలికాడు. ఆయన ముందు శిరస్సు వంచాడు.

ప్రపంచం వంగుతుంది, వంచేవాడే కావాలి (దునియా ఝుక్‌తీ హై, ఝుకానే వాలా చాహియే)

# వీరబాలుడు ఛత్రసాలుడు

పన్నా నరేషుడయిన చంపతరాయ్ కుమారుడు ఛత్రసాలుడు 1706 సం.లో దుర్గమ పర్వతారణ్య ప్రాంతంలో జన్మించాడు. బాలునికి 13వ యేడు వచ్చింది. తండ్రి స్వర్గస్థుడైనాడు. పిమ్మట అతడు మాతామహుడి ఇంట్లో పెరిగాడు. అటు తరువాత పన్నాకు వచ్చాడు. పిన తండ్రి సుజానరాయ్ ఎంతో మెలకువతో అతనికి సైనిక శిక్షణ యిప్పించాడు. తండ్రి శౌర్యసాహసాలు కుమారుని కూడా సంక్రమించాయి.

ఢిల్లీ సింహాసనం మీద ఔరంగజేబు అప్పటికే ఆసీనుడై ఉన్నాడు. ఆరోజుల్లోనే ఛత్రసాలుడు తన సమవయస్కులైన రాజపుత్ర బాలురతో కలిసి వింధ్యవాహినీ మందిరానికి భగవతీ దర్శనార్థం బయలుదేరి వెళ్లాడు. యువరాజు ఛత్రశాలుడు చెప్పులు బయట విడిచాడు. చేతులు కాళ్లు కడిగికొన్నాడు. దేవీపూజ కొరకు పుష్పాల కోసం ప్రక్కనే వున్న పూలతోటలోకి ప్రవేశించాడు. పూలు కోసుకుంటూ కొంచెం దూరం వెళ్లాడు. ఇంతలో గుర్రం మీద ఎక్కి అక్కడికి ఒక ముసల్మాను సైనికుడు వచ్చి అడిగాడు - 'వింధ్యవాసినీదేవి మందిరం ఎక్కడ?' ఛత్రసాలుడు అఢిగాడు - 'నీకెందుకు? దేవీపూజ చేస్తావా?' ముసల్మాను సర్దారు ద్వేషంతో కూడిన స్వరంతో ఇలా అన్నాడు - 'ఛీ, ఛీ. మేము మందిరాన్ని ధ్వంసం చేయటానికి వచ్చాము.' ఛత్రసాలుడు ఇది వింటూనే పూలబుట్ట మరొక బాలునికి యిచ్చి, ఇలా గర్జించాడు - 'నోరు దగ్గర పెట్టుకొని మాట్లాడు. మళ్లీ ఆ మాట అన్నావంటే నీ నాలుక చీరేస్తాను.'

సర్దార్ నవ్వి ఇలా అన్నాడు - నీవేమి చేయగలవు? నీ దేవి.....' మాట ఇంకా పూర్తి కాకముందే ఛత్రసాలుని ఖడ్గం అతని రొమ్ము దగ్గర ఆని ఉంది.

యుద్ధం మొదలయింది. ఖడ్గాలు దగ్గర వున్న రాజపుత్ర బాలురు తమ కత్తులను ఒరల నుండి పైగి లాగారు. కత్తులు కత్తులు కలిశాయి. ఆశ్చర్యం! ఛత్రసాలుడు శత్రుసైనికులనందరినీ హతమార్చాడు. మందిరంలో జరిగిన యుద్ధవార్త మహారాజుకు అందింది. మహారాజు సుజానరాయ్ యుద్ధస్థలానికి వచ్చాడు. జరిగినదంతా చూచి ఆనందంతో పులకరించిపోయాడు. ఛత్రసాలుణ్ణి హృదయానికి హత్తుకొన్నాడు.

భగవతి వింధ్యవాసినీ దేవి తన నిజమైన భక్తుడి శౌర్యకుసుమార్చనతో ప్రసన్నురాలయింది.

# అండమాను శిక్ష కంటే మరణదండనే మేలు

హైదరాబాదు రాజ్యానికి సమీపంలో జేరాపూర్ అనే పేరు గల ఒక చిన్న హిందూసంస్థానం ఉండేది. 1857లో జరిగిన స్వాతంత్ర్య సంగ్రామంలో అక్కడి రాజు ఎంతో ఉత్సాహంతో పాల్గొన్నాడు. అతడు ఇప్పుడింకా బాలుడే. ఆ రోజుల్లో హైదరాబాదు నిజాం దగ్గర మంత్రిగా ఉన్న సాలార్‌జంగ్ అతనిని మోసంతో బంధించి, ఆంగ్లేయులకు అప్పగించాడు.

ఆంగ్లేయ అధికారి కర్నల్ మిరాజ్ టేలర్ బాలుడైన ఆ రాజుతో మిక్కిలి స్నేహంగా ఉండేవాడు. రాజు ఆ అధికారిని 'అప్పా' అని పిలుస్తుండేవాడు. కర్నల్ టేలర్ రాజును కలుసుకొనేందుకై జైలుకు వెళ్లాడు. బాలుడు కనుక వివేకము లేనివాడని భావించి అతనిని బుజ్జగింపసాగాడు - 'తిరుగుబాటు చేసేవారి వివరాలు చెబితే నిన్ను క్షమించి వదలిపెడతాము.'

నిజమైన దేశభక్తుడయిన ఆ వీరబాలుడు తన సహచరులను మోసం చేస్తాడా? అలా ఎన్నటికీ జరుగదు. రాజు నవ్వి ఇలా చెప్పాడు - 'అప్పా, నేను ఎవరి పేరు చెప్పను. నా ప్రాణాలు కాపాడుకోనేందుకై తోటి సోదరుల జీవితాలకు ముప్పు కలిగిస్తానా? అది కృతఘ్నత అవుతుంది. నేనీ పాపం చేయలేను.'

'నీకు మరణశిక్ష విధింపబడుతుంది తెలుసా?'

బాలుడయిన ఆ రాజు సౌమ్యస్తిమిత గంభీర స్వరంతో ఇలా సమాధానం చెప్పాడు - అవును. నాకు తెలుసు. పిరికివారు మృత్యువుకు ముందే వేల పర్యాయాలు మరణిస్తారు. వీరులు మృత్యువులోనే ఆనందం అనుభవిస్తారు, ఒకే పర్యాయం మరణిస్తారు. అప్పా, నేను మృత్యువులోని ఆనందానుభవాన్ని కోరుకుంటున్నాను.' అని చెప్పి బాలుడు అంగీకరించనేలేదు..

కర్నల్ టేలర్ జోక్యంతో బాలుడని భావించి అతనికి అండమాను శిక్ష విధించారు. శిక్షను విని ఆ బాలుడు విచారం వ్యక్తం చేశాడు - 'జైలుశిక్ష, లేక అండమాను శిక్ష ఎందుకు కొరగానివాడు కూడా స్వీకరించడు. ఇకనేనో రాజును. అండమాను శిక్షకు బదులు మరణశిక్ష అంటేనే నాకు ఇష్టం.'

అని చెబుతూ రాజు ఒక ఆంగ్లేయ కాపలాదారుని వద్ద నుంచి తటాలున పిస్తోలు లాక్కొన్నాడు. తానే కాల్చుకొని మరణించాడు. ఆ సుకుమార వీరకిశోర జీవన కుసుమం నేల రాలిపోయింది. అతని సాహసాన్ని చూసి అంతా ఆశ్చర్యచకితులైనారు.

# యుధిష్ఠిరుని విద్యాభ్యాసం

కౌరవులూ పాండవులూ గురువైన ద్రోణాచార్యుని వద్ద విద్య నభ్యసించారు. నీతి, ధర్మములను గురించిన పాఠం చెబుతున్నాడు గురువు. ఆచార్యుడు, శిష్యులకు మూడు వాక్యాలు చెప్పి, వాటిని కంఠస్థం చేయమని చెప్పాడు - 'సత్యము పలుకుము, ధర్మము నాచరింపుము, క్రోధము చెందవద్దు'

ఇతర బాలురు అందరూ కొద్ది క్షణాలలోనే ఆ మూడు వాక్యాలు వల్లెవేసి గురువుగారికి వప్పజెప్పారు. యుధిష్ఠిరుని వంతు వచ్చింది. అతడు వినమ్రుడై చేతులు జోడించి నిల్చున్నాడు' క్షమించండి, ఆచార్యవర్యా, నాకు ఇప్పటికి కేవలం రెండు వాక్యములు మాత్రమే కంఠస్థమైనాయి'

'ఏమిటి దీని అర్థం? మూడవ వాక్యం రావటానికి నీకు ఎంత సమయం కావాలి ఇంకా?' ద్రోణాచార్యునికి అసంతృప్తి కలిగింది. 'ఆచార్యా, మూడవ వాక్యాన్ని నేను రేపు వప్పజెప్పుతాను' యుధిష్ఠిరుడు విన్నవించాడు. 'మంచిది, రేపు వప్పజెప్పు' ద్రోణాచార్యుడు తన అంగీకారాన్ని తెలిపాడు.

ఆ రేపు వచ్చింది. యుధిష్ఠిరుని పాఠం కంఠస్థం కాలేదు. గురువుగారు మండిపడ్డాడు. ఆయన బెత్తం తీసుకొని రెండు దెబ్బలు వేశాడు - 'జ్యేష్ఠ పుత్రుడవై ఉండి నీవింత మందమతిగా ఉంటావా! ఇంతటి సరళమయిన చిన్న వాక్యాన్ని కూడా నీవు కంఠస్థం చేయలేక పోయావు!' బాలుడైన యుధిష్ఠిరుని ముఖంలో మాలిన్యం యేమాత్రం కనిపించలేదు. అతడు ఏమీ

జరుగనట్లుగానే దరహాసవదనుడై ఉన్నాడు. ద్రోణాచార్యునికి ఆశ్చర్యం వేసింది. ఆయన యుధిష్ఠిరుణ్ణి అడిగాడు - 'అయితే నీకు ఏ వాక్యము గుర్తు ఉండడం లేదో చెప్పు?'

'ధర్మాన్ని ఆచరించే శక్తి నాకింకా రాలేదు గురుదేవా! నేను మీతో సత్యము చెప్పాను. మీరు నన్ను దండించారు. ఆ సమయంలో క్రోధము చెందకూడదని మనస్సులో అనుకుంటున్నాను. దీనితో మొదటి రెండు వాక్యాలు నా జీవితంలో భాగాలు అయినాయి అని నాకు విశ్వాసం కలిగింది. ఇక మూడవ వాక్యాన్ని ఆచరణలో పెట్టేందుకు ప్రయత్నం చేస్తాను'

ఇది వినటంతోనే ద్రోణాచార్యుని నేత్రాలనుండి అశ్రువులు రాలాయి. 'యుధిష్ఠిరా! నా ప్రియమైన శిష్యుడవు నీవు. ఈ రోజున నీవు నా కండ్లు తెరిపించావు. పాఠాన్ని కంఠస్థం చేయటం అంటే అర్థం దానిని నోటితో వల్లించటం కాదు దానిని జీవితంలో అమలు జరపటం, ఆచరణలో పెట్టడం'

# మధుర వాక్కు

ఒక పర్యాయం విక్రమాదిత్య మహారాజు తన సైనికులతోను, మంత్రితోను కలిసి వేటకై అడవికి వెళ్ళాడు. వేటాడుతూ వేటాడుతూ అడవిలో ఒకరినొకరు దూరమైనారు. ఒకచోట చెట్టు క్రిందనీడలోఅంధుడు, వృద్ధుడు అయిన ఒక సాధువు కూర్చుని ఉండగా చూచి విక్రమాదిత్యుడు అడిగాడు - 'సాధుమహారాజ్, ఇటువైపుగా ఎవరైనా ఇంతకుముందు వెళ్ళారా!' ఆ అంధసాధువు ఇలా చెప్పాడు - 'మహారాజా! అందరికంటె ముందు మీ సేవకుడు వెళ్ళాడు. అతని వెనుక మీ సేనానాయకుడొకడు

వెళ్ళాడు. సేనానాయకుని తరువాత మీ మంత్రి కూడా ఇంతకుముందే వెళ్ళాడు' అంధుడైన ఆ సాధువు చెప్పిన సమాధానం విని విక్రమాదిత్యుడు ఆశ్చర్యంతో ఆసక్తితో ఇలా అడిగాడు - 'మహాత్మా! మీకు నేత్రాలు కనిపించవుకదా! నా సేవకుడు, సేనానాయకుడు, మంత్రి ఇక్కడనుండి ఇప్పుడే వెళ్ళినట్లు ఎలా గ్రహించారు. నేను రాజునైనట్లు కూడా ఎలా కనుగొన్నారు?'

అంధుడైన సాధువు ఇలా చెప్పాడు - 'మహారాజా! నేనా ముగ్గురినీ, మిమ్ములను మీ మాటలు విని కనిపెట్టాను. అందరికంటె ముంద సేవకుడు వచ్చినాతో, 'ఏమిరా, గ్రుడ్డివాడా! ఇటు ఎవరైనా వచ్చారా' అడిగాడు. కొంతసేపటికి సేనానాయకుడు వచ్చి, 'సూరదాస్, ఇటు వెళ్ళారా?' అని అడిగాడు, - చివరకు మీ మంత్రి వచ్చి 'సూరదాస్‌జీ ఎవరయినా వెళ్ళారా?' అని అడిగారు. మీరు వచ్చి, 'సాధుమహారాజ్! ఎవరైనా బాటసారి వచ్చి వెళ్ళాడా?' అని అడిగారు. 'మహారాజా! యొక్క వాక్కు ద్వారా అతని పదవి, అతని ప్రతిష్ఠ ఏమిటో గుర్తించ